# ముకుందమాల

(ప్రతిపదార్థాంధ్రపద్య సహితము)

రచయిత :

మహోపాధ్యాయ, కవిశేఖర, విద్యాలంకార

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

ప్రకాశకులు :

శ్రీసీతారామ నామసంకీర్తన సంఘము [రిజిష్టర్డు]

శ్రీరామనామక్షేత్రము, గుంటూరు.

# ముకుందమాల

(ప్రతిపదార్థాంధ్రపద్యసహితము)



రచయిత:

మహోపాధ్యాయ, కవిశేఖర, విద్యాలంకార

## పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

గుంటూరు హిందూకళాశాలా సంస్కృతాధ్యాపకులు

ముద్రణము:

శాన్తిశ్రీ ప్రెస్, గుంటూరు-1

1957

ప్రకాశకులు:

శ్రీసీతారామ నామసంకీర్తన సంఘము [రిజిష్టర్డు]

(శ్రీరామనామక్షేత్రము, గుంటూరు.

మూల్యము 0-12-0

శ్రీరామనామ క్షేత్రము. గుంటూరు



కృతిపతి

శ్రీకోదండరామప్రభువు

టిలక మల్లి వేంకటసుబ్బమ్మ
బి.ఏ., బి.ఇడి
ఉపాధ్యాయిని,
[illegible] గుంటూరు

# పీఠిక

ముకుందమాల భక్తిరసప్రధాన మగుస్తోత్రరాజము. 12 10/1953 శ్లోకసంఖ్యచే నిది చిన్నది యైనను భగవన్మాహాత్మ్య ప్రతిపాదకమై యుజ్జ్వలభక్తి నుద్దీపింపఁ జేయుటలోఁ బెద్దది యనక తప్పదు. ఈమాలలో నన్యమాలలయందువలెఁగాక పరిమళము చెడనివాడని నాణెము లగునలువది శ్లోకకుసుమరాజంబులు గణబద్ధంబులును గుణబద్ధంబులునై గుమాయించుచున్నవి. ఏతత్స్తోత్రకర్త యీమాలను తనప్రియదైవ మగుముకుందుని కంఠమునందు సమర్పించినప్పటికి నిది ముకుందప్రియులందఱి కంఠమునఁ గానవచ్చుట మాలామాహాత్మ్యవిశేషము. భగవత్ప్రియ యగునిట్టిముకుందమాలను రచించినమహనీయుఁడు భాగవతాగ్రేసరుండగు కులశేఖరాళ్వారు. ఈతఁడు మహారాజగుట యేగాక మహాభక్తుఁడును, సర్వస్వమును శ్రీరంగనాథునకు సమర్పణచేసిన మహాత్యాగియునై యలరారెను. బాల్యమునుండియు నే నీముకుందమాలను పారాయణము చేసెడివాఁడను. అట్టితఱి నొకనాఁడు సంస్కృతానభిజ్ఞులు సైతము దీనియర్థము నెఱుంగుట కనువుగా 'టీక' వ్రాయ వలయు ననియు, శ్రీముకుందగుణమననార్థమైనను దీని ననువదింప వలయు ననియు సంకల్ప ముదయించెను. ఆసంకల్పమే యనుపద మీగ్రంథరూపమును దాల్చినది. పదఁపడి కొన్నాళ్ళకు నాకు 'కావ్యమాలాగుచ్ఛమున' ముద్రితమగు ముకుంద

మాలను జూచుభాగ్యము గల్గినది. అందుఁ బెచ్చుగాఁ గొన్ని శ్లోకము లుండుటయు, నవియు భగవన్మాహాత్మ్యపరిబోధకములుగా నుండుటయు, గమనించి ఈ గ్రంథములో 'ముకుందమాలానుబంధ' మను పేరఁ జేర్చుకొని టీకానువాదముల వ్రాసియుంచితిని. 1918 సంవత్సరమునకే యీ గ్రంథము వ్రాయఁబడి నాటినుండి నేఁటివఱకు నముద్రితముగనే మాతృకాస్వరూపముతో నాకడ నుండెను దీనితరువాత వ్రాయఁబడిన కృతు లెన్నియో ముద్రితములై యున్నను నాదృష్టి దీనియందుఁ బ్రసరింపకుండుటకు దీనిభవితవ్యత యిట్లుండుటకంటెఁ గారణాంతరము మృగ్యము. భగవత్ప్రేరణము మిత్రుల యాదరణము తోడై నేఁటికిక్కృతికుమారి మోక్షసాధనియందవతరించుటయు అచింత్యమహిముఁ డగు శ్రీకోదండరామమూర్తి కనుఁగుటిల్లాలు కానోచుటయు నాయదృష్టము తమ బిడ్డను లోకోత్తరగుణోత్తరుఁ డగుపురుషునిచేతఁ బెట్టుటకంటె జనకులకును గృతికన్యాజనకులకును మహత్తరానంద మేమి యుండును? ఇక్కల్యాణకార్యమున నాకుఁ దోడ్పడినమిత్రులకును శ్రీమోక్షసాధనీసంపాదకులకును నాకృతజ్ఞతను దెలుపుచు సకలగుణాభిరాముఁ డగు శ్రీకోదండరామునకు మత్కృతికన్యను సమర్పించి నాజన్మమును ధన్యమొనర్చుకొందును.

ఇట్లు,
గ్రంథకర్త:
పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

2-12-57
గుంటూరు.

శ్రీహయగ్రీవాయ నమః

# కృతిసమర్పణము

★

శ్రీమంతులమేల్బంతివి
సామంతనృపాలపూజ్యచరణదశరథ
క్ష్మామండలేశసుతుఁడవు,
రామా! నీసదృశు లెవరు? రక్షోభీమా! 1

అక్షోభ్యాద్భుతబాహువీర్యనిలయా! హర్యక్షకాయా! జగ
చ్చక్షుర్వంశసుధాపయోనిధిశరచ్చంద్రాభ! శ్రీరామనా
మక్షేత్రాలయ! యాంజనేయనుత! శ్రీమన్మైథిలీవల్లభా!
కుక్షిస్థాఖిలలోక! నీ కివె నతుల్ కోదండరామప్రభూ! 2

పూర్ణప్రజ్ఞుఁడఁ బెక్కువర్షములకున్ బూర్వంబె భక్త్యున్నతిన్
గర్ణానందముఁ గూర్పఁగాఁ గలభవత్కల్యాణవృత్తాంతమున్
వర్ణింపన్ మనసై తెలుంగునను గావ్యం బొందు నిర్మించి బో
ధార్ణోరాశికి నీ కొసంగితిని దేవా! యానవా లున్నదే? 3

నెట్టెతి షష్టివర్షములు నీకృప యుండగ, రెండుబాసలన్
దిట్ట యితం డటంచుఁ గవిధీరులు మెచ్చఁగ నొజ్జ నైతిఁ, జేఁ
బట్టి కలంబు వ్రాసితిఁ బ్రబంధశతంబు, కొఱంత యేమి నీ
యట్టినిలంపటాళి యభయం బిడి ప్రోవఁగ జానకీపతీ! 4

వినుతశ్రీకులశేఖరాస్యకమలావిర్భూతమాధ్వీకమో
యన నొప్పారుముకుందమాల నమరవ్యాహారహారాయితన్

దెనుఁగుం జేసి భవత్పదాబ్జములకున్ దీనిన్ సమర్పించితిన్
గొనుమా భక్తిసముజ్జ్వలన్ గృతిసతిన్ గోదండరామప్రభూ! 5

సతి నా కీజని సీత యోర్తుకయ సాక్షాదేకపత్నీవ్రత
స్థితుఁడన్ ద్వత్కృతిపుత్త్రి కేల్గొనఁగ బ్రాఁతే! యం చనన్ బోకు మ
త్కృతిపద్మాలయ నా సువర్ణమయి త్వత్సీతాసతీరత్న మే
కుతుకం బొప్ప గ్రహింపు మీగుణవతిన్ గోదండరామప్రభూ! 6

జనకుఁడను గాను గానీ
జనకుఁడఁ గృతిసుతకు, వదనజలజోద్భవయున్
వినుతసువర్ణయు నగుటన్
జననుత! యీకృతి సువర్ణజానకి గాదే! 7

శ్రీవల్లభా! వరదా! విభూ! యని నిన్నె
ధ్యానించు నిది నీకె తగిన దనియు
'మోక్షసాధని' నెలల్ మోచి కన్నట్టియ
ర్మిలిబిడ్డ యగుటఁ బ్రేమింతు వనియు
కులశేఖరుఁడు భక్తకులశేఖరుండు త
చ్ఛ్రీసూక్తి చెన్నారుచిన్న దనియు
అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడవొ
నీమెప్పు గొనుగుణాన్విత యనియు.

హరికి లక్ష్మణ వలె లక్షణాఢ్య యనియు
నిచ్చుచున్నాఁడఁ గృతిబాల నేలుకొనుము
రామనామమహాక్షేత్రరాజవర్తి!
రమ్యతరకీర్తి! కోదండరామమూర్తి! 8

# శ్రీ కులశేఖరాళ్వారుల జీవితచరిత్ర

మధ్వశ్రీ కవిశేఖర పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారు

కేరళ దేశమునకు రాజధాని యగు 'కోళి' పురమును భాగవతోత్తముఁ డగుదృఢవ్రతమహారాజు పాలించుచుండెను. అతని కెంతకాలమునకు సంతానము కలుగకుండెను. అతఁడు పుత్రసంతతికై పరమభక్తితో భగవానుం డగుశ్రీహరి నారాధించెను. భక్తవత్సలుం డగుభగవానుఁ డాతనియారాధనమునకు మెచ్చి యొకనాఁడు స్వప్నమున సాక్షాత్కరించి 'రాజా! విచారింపకుము. నీభక్తికి మెచ్చితిని. నీమనోరథము కొలఁదికాలములోనే ఫలించును. నాకౌస్తుభమే నీకుఁ బుత్త్రుఁడుగా నుద్భవించి నీవంశము నుద్దీపింపఁ జేయును' అని పలుకఁగా రాజు పరమానందభరితుఁడై భగవంతునియవ్యాజకరుణకు నచ్చెరు వంది ప్రొద్దుననే లేచి బంధుజనమునకుఁ జెప్పఁగా వారును సంతసిల్లిరి. తదనుగుణముగానే కాలాంతరమున నాతనిపట్టపురాణి గర్భము ధరించెను. శుక్లపక్షచంద్రునివలె నాగర్భము క్రమముగా వర్ధిల్ల నొక శుభముహూర్తమున నారాణి భగవంతునికౌస్తుభాంశ మగునొక నందనుని గాంచెను. మహారాజు తజ్జన్మదినము* కలి 28 వ పరాభవసంవత్సరమున మాఘ శుద్ధ ద్వాదశీ పునర్వసుయుక్త గురువార మగుటచే నుత్తమోత్తమమని సంతసించి కులము

---

* కొందఱు మాఘశుద్ధదశమీ పునర్వసుయుక్తగురువార మందురు.

నకు శేఖరమువంటివాఁడు కాఁగలఁ డని యాకుమారునకు 'కులశేఖరుఁడు' అని నామకరణ మొనర్చెను. క్రమముగాఁ దండ్రి కుమారునకుఁ జౌలాదిసంస్కారములను యథాకాలముగ యథావిధిగ జరిపించెను. తగినకాలమునఁ దగినగురువులయొద్దఁ జదివింప నాబాలుఁడు 'ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః' అన్న ట్లల్పకాలముననే యఖిలవిద్యాపారంగతుఁడై యస్త్రవిద్యయం దద్వితీయుఁ డాయెను. అంత యుక్తవయస్కుఁడై తనయసదృశప్రతిభాబలాదులచేఁ బ్రజానురాగమును జూఱఁగొన్నతనయునకుఁ దండ్రి యౌవరాజ్యపట్టాభిషేక మొనర్చెను. యువరా జగుకులశేఖరుండును జయభేరులు మ్రోగ దిగ్విజయ మొనర్చి శాత్రవుల నిర్జించి కానుకలఁ బరిగ్రహించి రాజ్యమును నిష్కంటకము నొనర్చి రాజకార్యములఁ దండ్రికిఁ గుడిభుజముగా నుండెను. దృఢవ్రతమహారాజు కుమారునియతిమానుషమహిమ కచ్చెరు వంది యఖిల రాజ్యము నాత్మజున కప్పగించి తప మొనర్ప వనంబుల కేఁగెను. అంతఁ గులశేఖరుఁ డధికబాధ్యతతో ధర్మోత్తరముగా నేల నేలఁ బర్జన్యుఁడు సకాలమున వర్షించెను. వసుమతి సస్యశ్యామలమై విరాజిల్లెను. ఈతిబాధలు నాధివ్యాధులు లేక ప్రజలు రామరాజ్యమునందువలె నానందభరితులైరి. ధర్మము కృతయుగమునందువలెఁ బ్రవర్తిల్లెను. అందఱును ధనికులే; యందఱును దాతలే; యందఱును భగవద్భక్తులే యైరి. వేయేల? అందఱును గుణగణంబుల

నభినవకుల శేఖరులై 'యథా రాజా తథా ప్రజా' అనుసూక్తిని సార్థక పఱచిరి. ఇట్లు కొంతకాలము జరుగఁ గులశేఖరునిపై శ్రియఃపతినిరుపాధికజాయమానకరుణాకటాక్షము ప్రసరించెను. అంత సేనేశు లాచార్యులై పంచసంస్కారము లొనర్చి తత్త్వోపదేశముఁ గావింపఁ గ్రమముగాఁ గులశేఖరుఁ డైహిక భోగముల రోసి యాబ్రహ్మస్తంబపర్యంతము నిఖిలము నిస్సారము ననిత్యము నని యెఱింగి జాతవైరాగ్యుఁడై విష్ణుపాదైక సంశ్రయుఁ డాయెను.

ఒకప్పు డీమహాభక్తుఁడు వేంకటాచలమాహాత్మ్యమును వినుచు భక్తితన్మయుఁడై 'ఓ వేంకటాచలపతీ! నీయాలయమున నొకసోపానమునై స్థిరముగానుండి యధరపల్లవములో నందముఁ గుల్కునీముఖారవిందము నెన్నఁడు చూతునో!' యని నిర్వేదపడెను. మఱి యొకతఱి నీమహనీయుఁడు రామాయణశ్రవణావసరమున—

'చతుర్దశసహస్రాణి । రక్షసాం భీమకర్మణామ్ ।
ఏక శ్చ రామో ధర్మాత్మా । కథం యుద్ధం భవిష్యతి' ?

అనుశ్లోకమును విని యుద్విగ్నుఁడై 'యేమి యీయన్యాయము! ఇంత యధర్మ మెందేనిఁ గలదా? ధర్మాత్ముఁడగునొక్కరాముని 14 వేలమంది ఘోరనిశాచరు లెదుర్కొనుటయా? సేనాధిపతీ! మనసేనను రామసాహాయ్యార్థమై జనస్థానంబునకు నడిపింపు మిదే నేను వచ్చుచున్నాఁ'డనని కవచఖడ్గాదుల ధరింప, లౌకికుఁ డగునాపౌరాణికుఁడు రాజు తన్మయుఁ డౌటఁ దెలిసి గ్రంథమునఁ బత్రములఁ ద్రిప్పి ''రాజా! ఆగు మాగుము—

'తం దృష్ట్వా శత్రుహంతారం । మహర్షీణాం సుఖావహమ్
బభూవ హృష్టా వైదేహీ । భర్తారం పరిషస్వజే.'

అని పఠించి, యీరాముఁ డచిరకాలములోనే త న్నెదుర్కొనిన ఖరదూషణాదిదుష్టదానవులఁ బరిమార్చి విజయలక్ష్మితో రాఁగా సీత చూచి ప్రీత యై గాఢాలింగన మొనర్చెనను-'' అని నుడువఁగా విని సంతసించి ''రామా! అసదృశపరాక్రముఁడవు ఒక్కఁడవే 14 వేలరక్కసుల నుక్కడంచితివి. మహావీరుఁడవు. నీసాటివేల్పు లేఁ'' డని యానందబాష్పముల విడిచెను. మఱియొకతఱి-

''జహార రావణ స్సీతాం । బుధః ఖే రోహిణీ మివ''

ఆకసమున బుధుఁడు రోహిణినివలె, రావణుఁడు సీతను హరించె నని విని విభ్రాంతుఁడై ''పిఱికిపందా! రామలక్ష్మణులు లేనిసమయమున మాతల్లిని సాధ్వీమతల్లిని సీత నపహరింతువా? లంక కేఁగిన బ్రతుకుదు ననుకొంటివా? చూడు మిప్పుడే చతురంగబలముతో నబ్ధి దాఁటి లంకఁ జొచ్చి నిన్ను సబంధుమిత్రముగా వధించి మాతల్లిచెఱఁ బాప నేని నేను 'గులశేఖరుఁడఁ గా'' నని యెంద ఱాపిన నాగక కుత్తుక బంటి నీటిదాఁక సముద్రమున నేఁగుచున్నకులశేఖరుఁ జూచి 'న మే భక్తః ప్రణశ్యతి' అనుప్రతిజ్ఞావాక్యమును స్మరించుకొని శ్రీరాముఁడు దర్శన మిచ్చి 'రాజా! నీకేల యీశ్రమ. దుష్టుఁ డగురావణుని సబంధుమిత్రముగాఁ దున్మి 'మీతల్లిని గొనివచ్చితిని. ఇదిగో సీత, వీఁడుగో లక్ష్మణుఁడు. పద

రాజధాని' కని నగరమునకుఁ గొనివచ్చి యంతర్హితుఁడు కాఁగాఁ గులశేఖరుఁడు నిధిని గోల్పోయిననిరుపేదవలెఁ దల్లడిల్లి యీముకుందమాలను వ్రాసి కొంతయూఱడిల్లెను. మఱియొకసమయమున శ్రీరంగమాహాత్మ్యమున-

శ్లో॥ శ్రీరంగయాత్రా శ్రీరంగ । యియాసా చైవ నారద!
ఉత్తారయతి సంసారాత్ । నిత్యవాస స్తు కిం పునః ?

అనుశ్లోకమును విని శ్రీరంగమునకు వెళ్ళినవారిజన్మము నిరర్థక మని భావించి యట్టిపుణ్యవిశేషమును దనవారలకుఁ గూడఁ గలిగింప నెంచి "శే పుదయమే మేము శ్రీరంగనాథుని దర్శింప శ్రీరంగమునకుఁ బోవుచున్నాము. రాఁదలఁచినవారెల్ల రండో!" యని దండోరా వేయించెను. మంత్రులది విని మహాభక్తుఁ డగుకులశేఖరుఁడు శ్రీరంగమునకేఁగి యప్రాకృతదివ్యసుందరవిగ్రహుఁ డగుశ్రీరంగనాథుఁ జూచినఁ దిరిగి నగరమునకు రాఁడు; రాజ్య మరాజక మగునని నిశ్చయించుకొని యేనాఁటి కానాఁడు మహావిద్వాంసులును భాగవతోత్తములు నగుశ్రీవైష్ణవులను వెల్లవాఱుసరికి రాజుగారిముందు నిలుప రాజును సంతోషముతో-

"షష్టివర్షసహస్రాణి । విష్ణో రారాధనే ఫలమ్ ।
సకృ ద్వైష్ణవపూజాయాః । కలాం నార్హతి షోడశీమ్"

అఱువదివేలేండ్లు విష్ణ్వారాధన మొనర్ప నగుపుణ్యఫల మొకమాఱు సద్వైష్ణవపూజఁ గావించిన నగుపుణ్యఫలములో షోడశాంశమునకు సరి గాదు' అని విన్నవాఁ డగుటచేఁ దత్కైంకర్యమున నిమగ్నుఁ డగుచు వారికిఁ దండములను

తద్భోజ్యగుడమాషాదివస్తువులను బుష్కలముగా నొసఁగి వారివిష్ణ్వారాధన, భోజనాది, పర్యంతము వేచి తద్భుక్తావశిష్టాన్నమును భుజించుచు సాయంకాలమువఱకు వారివలన శ్రీమద్రామాయణభాగవతాదిగ్రంథములలోనిరహస్యముల వినుచుండెను.

ఇట్లు మహారాజు ప్రతినిత్యము వైష్ణవగోష్ఠిలో నుండి రాజకార్యములు పట్టించుకొనక యుండుట కోర్వక మంత్రులు శ్రీవైష్ణవులపై రాజునకు ద్వేషమును గల్గించుటకు శ్రీరాజగోపాల, శ్రీరామభద్ర స్వాములకుఁ దిరుమంజనము చేయువేళ నొక యమూల్యహారమును దాచి శ్రీవైష్ణవు లపహరించి రని తేనితోఁ జెప్పిరి. కులశేఖరుఁడు కర్ణశల్యాయమాన మగు నావాక్యమును విని మండిపడి 'మహాపచారము, మహాపచారము- భాగవతు లెన్నఁటికిని జోరులు గారు. సత్యము. ప్రమాణ మొనర్చి చెప్పెదను. విష్ణువునుగాని విష్ణుభక్తులనుగాని యెవఁడు నిందించునో వానికి జిహ్వాచ్ఛేదనమే ప్రాయశ్చిత్తము. విష్ణు వందఱికంటె నధికుఁడు. తత్ప్రియు లగువైష్ణవు లంతకంటె నధికులు. అట్టి వైష్ణవనింద నెట్లు సహింతు?' నని సచేలస్నాన మొనర్చి శ్రీరాజగోపాలస్వామిసన్నిధియందు భాగవతులు పరమశుద్ధులు; వారు తస్కరులు గా రని యెల్లరుఁ జూచుచుండ బుసలు కొట్టుచున్నకోడెత్రాచును జేతితోఁ బట్టుకొనఁగా నయ్యద్భుతకృత్యమునకు మంత్రులు భీతులై హారమును సమర్పించి తమయపరాధమును క్షమింపుఁ డని రాజుకాళ్ళ

మీఁదను, శ్రీవైష్ణవుల కాళ్ళమీఁదను బడి వేఁడికొనిరి. రాజు పశ్చాత్తప్తు లగువారినేరముల క్షమించి శౌరిచింతా విముఖు లగుజనులసహవాసముకంటె హుతవహజ్వాలాపరీత పంజరాంతరవాసమేని గొంత మే లని భావించి దుస్సచివ దూషిత మగురాజ్యమునందు విరక్తుఁడై సింహాసనమునఁ బుత్త్రుఁ డగుదృఢవ్రతమహారాజు నభిషిక్తుఁ జేసి కతిపయ భక్తకోటితో శ్రీరంగముఁ జేరి శ్రీరంగనాథుని సేవించి జన్మతఃప్రభృతి శ్రీరంగనాథునందే యనురక్త యగునిజ పుత్త్రిని నీలాదేవిని రంగనికి సమర్పించి తనసంపదల నన్నిటి నరణముక్రింద స్వామికి సమర్పించి 'పెరుమాళ్ తిరుమొళి' యనుదివ్యప్రబంధమును రచించి దివ్యదేశముల సేవించి శ్రీరంగాదిదివ్యస్థలముల మంగళాశాసనము చేసి శ్రీరంగ క్షేత్రముననే నిత్యనివాస మొనర్చుచుఁ దనకడపటిదినములఁ గడప మన్నారుకోవెలకు వేంచేసి శ్రీరాజగోపాలుని సేవించుచు నచ్చోటనే తన 67 వ సంవత్సరమునఁ బరమపదమునకు వేంచేసెను. ఆదర్శప్రాయ మగునీయాళ్వారుచరిత్రము ముముక్షువుల కొజ్జబంతి గదా !

శ్లో॥ ఏవం మహాత్మా కులశేఖరార్యో,
రేజే తదా వైష్ణవపారిజాతః ।
అవ్యాహతశ్రీ ర్హరిభక్తిధర్మా,
ప్రహ్లాదవ ద్విశ్రుతదివ్యకీర్తిః ॥

శ్రీమద్వ్యాజిముఖుం జిదాత్మకు మదిం

  జింతించి, పూజించి నన్

  బ్రేమన్ బ్రోచినతల్లిదండ్రులను 'కా

  వేరీజగన్నాథులన్'

నేమం బొప్ప భజించి మద్గురుల వా

  ణీభక్తులన్ సత్కవి

స్తోమం బెన్న ముకుందమాలఁ దెనిఁగిం

   తున్ నింతు సన్మోదమున్.

# ముకుందమాల

( ప్రతిపదార్థాంధ్ర పద్యసహితము )

శ్లో॥ ఘుష్యతే యస్య నగరే
రంగయాత్రా దినే దినే
త మహం శిరసా వందే
రాజానం కులశేఖరమ్. (1)

ప్రతిపదార్థము :- యస్య = ఎవనియొక్క, నగరే = పట్టణమునందు, దినే దినే = ప్రతిదినము, రంగయాత్రా = శ్రీరంగప్రయాణము, ఘుష్యతే = చాటఁబడుచున్నదో, తమ్ = అట్టి, రాజానమ్ = రాజగు, కులశేఖరమ్ = కులశేఖరాళ్వారిని, శిరసా = తలతో, అహమ్ = నేను, వందే = నమస్కరించుచున్నాను.

గీ॥ రంగయాత్ర యెవనినగరంబునందుఁ
బ్రత్యహంబును ఘోషింపఁ బడుచు నుండు
అతని కొనరింతు నొదల నతులు రాజ
శేఖరుం డైన శ్రీకులశేఖరునకు.

శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద! (2)

ప్రతిపదార్థము :- (హే) ముకుంద! = మోక్షమునిచ్చెడు ఓ శ్రీకృష్ణా! శ్రీవల్లభ ! = లక్ష్మీదేవికిఁ బ్రియుఁడా! ( లేదా ) లక్ష్మీదేవి ప్రియురాలుగాఁ గలవాఁడా! ఇతి = అని, వరద ! = వరముల నొసంగువాఁడ! ఇతి = అని. దయాపర ! = దయయే ప్రధానముగాఁ గలవాఁడా! ఇతి = అని, భక్తప్రియ = భక్తులకుఁ బ్రియుఁడ వైనవాఁడా! (లేదా) భక్తులు ప్రియులుగాఁ గలవాఁడా! 'ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ

ప్రియః' అను గీతా వాక్యమును బట్టి భక్తులకు భగవంతుఁడును భగవంతునకు భక్తులును బ్రియు లని భావము. ఇతి = అని, భవలుంఠనకోవిద !=సంసారమును ఛేదించుటయందుఁ బండితుఁడా ! ఇతి = అని, నాథ ! = ప్రభువా ! ఇతి = అని, నాగశయన ! = శేషుఁడే శయ్యగాఁ గలవాఁడా ! ఇతి = అని, జగత్ + నివాస ! = ప్రపంచమునకు ఆధారభూతుఁడా ! ఇతి = అనియు, ఆలాపనమ్ = పలుకుటను (కీర్తించుటను) ప్రతిపదమ్ = అడుగడుగునను, (లేదా) మాట మాట యందును, మే = నాకు, కురు = చేయుము.

గీ॥ శ్రీపతీ ! వరదా ! కరుణాపరా ! భ
వాబ్ధితారక ! భక్తప్రియా ! జగన్ని
వాస ! అహిశాయి ! నాథ ! అన్ వాకు నాకుఁ
బదపదంబున నొసఁగఁ గోరెద ముకుంద !

శ్లో॥ జయతు జయతు దేవో దేవకీనందనో౽యం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః. (3)

ప్రతిపదార్థము :- దేవకీనందనః = దేవకీపుత్త్రుఁడగు, అయమ్ = ఈ, దేవః = క్రీడాదిగుణవిశిష్టుఁ డగు, కృష్ణుఁడు, జయతు, జయతు = సర్వోత్కృష్టుఁడై మఱి మఱి ప్రకాశించుఁ గాక, వృష్ణివంశప్రదీపః = యాదవ వంశమును బ్రకాశింపఁ జేయునట్టి, కృష్ణః = శ్రీకృష్ణుఁడు, జయతు, జయతు = సర్వోత్కృష్టుఁడై మఱి మఱి ప్రకాశించుఁ గాక, మేఘశ్యామలః = మేఘమువలెఁ జామనిచాయ గలవాఁడును, కోమల + అంగః = సుకుమారము లయిన అవయవములు గలవాఁడును అగు కృష్ణుఁడు, జయతు, జయతు = సర్వోత్కృష్టుఁడై మఱి మఱి ప్రకాశించుఁ గాక, పృథ్వీభారనాశః = భూభారమును నశింపఁజేయువాఁడును, ముకుందః = ముక్తి నిచ్చువాఁడును అగు శ్రీకృష్ణుఁడు, జయతు జయతు = సర్వోత్కృష్టుఁడై ప్రకాశించుఁ గాక.

మాలిని :- జయ జయ ! సుజనాభీష్టప్రదా ! నందసూనూ !
జయ జయ ! యదుసద్వంశప్రదీపా ! మురారీ !
జయ జయ ! నవమేఘశ్యామలా ! కోమలాంగా !
జయ జయ! మహీధూర్నాశంకరా! శ్రీముకుందా!

శ్లో॥ ముకుంద మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవంత మేకాంత మియంత మర్థమ్
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్. (4)

ప్రతిపదార్థము :- ముకుంద ! = మోక్షప్రదుఁడవగు ఓ శ్రీకృష్ణా ! (అహమ్ = నేను) మూర్ధ్నా = తలతో, ప్రణిపత్య = నమస్కరించి, భవంతమ్ = నిన్ను, ఏకాంతమ్=ఒకటియే అవధిగాఁ గలదియు, ఇయంతమ్ = ఇంతమాత్రమే అగు అర్థమ్ = ప్రయోజనమును, యాచే = యాచించుచున్నాను. (ఆప్రయోజన మేది యన) భవత్ప్రసాదాత్ = ఏలినవారి అనుగ్రహమువలన, త్వత్, చరణ, అరవిందే = కమలములఁ బోలు తమ పాదములయందు, భవే, భవే, = ప్రతిజన్మమునందును, మే = నాకు, అవిస్మృతిః = మఱపు లేకుండుట, అస్తు = అగుఁ గాక.

గీ॥ మాధవా ! నిన్ను శిరసా నమస్కరించి
దీని నేకాంతముగను బ్రార్థించు చుంటి
జన్మ జన్మంబునకు భవచ్చరణయుగము
మఱపు రాకుండుఁ గాత నీకరుణచేత.

శ్లో॥ నాహం వందే తవ చరణయో
ర్ద్వంద్వ మద్వంద్వహేతోః
కుంభీపాకం గురు మపి హరే !
నారకం నాపనేతుమ్

రమ్యా రామా మృదుతనులతా
నందనే నాపి రంతుం
భావే భావే హృదయభవనే
భావయేయం భవంతమ్.

ప్రతిపదార్థము :- హరే ! = ఓ ముకుందా ! అహమ్=నేను, అద్వంద్వహేతోః=ద్వంద్వములు లేకుండుటకొఱకు, (లేదా) 'అద్వంద్వహేతోః' అనుచోట అ, ద్వంద్వహేతోః, అనిపదచ్ఛేద మొనర్చి అ=అకారవాచ్యుఁడ వగు ఓ శ్రీకృష్ణా! ద్వంద్వహేతోః = మిథునమువలనఁగలుగు సుఖము కొఱకు, అనియు అర్థము చెప్పికొననగును, తవ=నీయొక్క, చరణయోః = పాదములయొక్క, ద్వంద్వమ్ = జంటను, న, వందే = నమస్కరింపను, గురుమ్, అపి = భరింప రాని దైనను, కుంభీపాకమ్ = కుంభీపాక మనెడి, నారకమ్ = నరకమును, అపనేతుమ్ = పోఁగొట్టుటకు, ( న, వందే = నమస్కరింపను ) మృదుతనులతాః = మెత్తనితీఁగెవంటి శరీరములుగల, రమ్యాః = అందగత్తె లగు, రామాః = స్త్రీలను, నందనేనఅపి = నందనవనముచే నేని (లేదా) కుమారునితో నేని, రంతుమ్=క్రీడించుటకు, న, వందే = నమస్కరింపను) ఇఁక నేమి చేయుదుననఁగా – భావే భావే = జన్మజన్మమునందును, హృదయభవనే = మన స్సనెడుఇంటియందు, భవంతమ్ = నిన్ను, భావయేయమ్ = ధ్యానింతును.

శా॥ మీపాదద్వయికిన్ బ్రణామములు స్వా
మీ ! ముక్తికై కాదు, కుం
భీపాకం బనుఘోరమౌ నరకమున్
బిట్టార్పఁగాఁ గాదు, మేల్
ప్రోవౌ నవ్విరిబోండ్ల నందనమునన్
భోగింపఁగాఁ గాదు, దే
వా ! పూజించెద జన్మజన్మమున భా
వం బన్ గృహానన్ నినున్.

శ్లో॥ నాస్థా ధర్మే న వసునిచయే
నైవ కామోపభోగే
య ద్యత్ భవ్యం భవతు భగవన్ !
పూర్వకర్మానురూపమ్
ఏతత్ ప్రార్థ్యం మమ బహుమతం
జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగగతా
నిశ్చలా భక్తి రస్తు.

ప్రతిపదార్థము :- మమ = నాకు, ధర్మే = ధర్మమునందు, ఆస్థా = ఆసక్తి, న = లేదు, వసునిచయే = ధనరాశియందు, (ఆస్థా, = ఆసక్తి, న = లేదు) కామ + ఉపభోగే = కామసౌఖ్యముల ననుభవించుటయందును, ఆస్థా = ఆసక్తి, న, ఏవ = లేనే లేదు, భగవన్ != షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగుముకుందా ! యత్, యత్ = ఏది యేది, భవ్యమ్ = అవశ్యము కావలసి యున్నదో, (తత్, తత్ = అయ్యది) పూర్వకర్మ, అనురూపమ్ = పురాకృత కర్మానుసారము, భవతు = అగుఁ గాక, జన్మజన్మాంతరే అపి = ప్రతిజన్మమునందును, త్వత్ ... గతా, త్వత్ = నీ, పాద + అంభోరుహ = పాదపద్మములయొక్క, యుగ = జంటను, గతా = పొందిన, నిశ్చలా = చలనములేని (స్థిరమైన) భక్తిః = భక్తియే, అస్తు = అగుఁ గాక, ఇతి, ఏతత్ = ఇదియే, మమ = నాకు, ప్రార్థ్యమ్ = కోరఁ దగినదిగా, బహుమతమ్ = మిక్కిలి యిష్టమైనది.

గీ॥ కనను ధర్మార్థకామభోగముల నాస్థ
కలుగునది కర్మవశమునఁ గలుగుఁ గాక
ఇదియె ప్రార్థింతు నేజని నేని నాకుఁ
గలుగుతఁ ద్వదంఘ్రి నిశ్చలాఖండభక్తి.

శ్లో॥ దివివా భువి వా మమాస్తు వాసో
నరకే వా నరకాంతక! ప్రకామమ్ ।
అవధీరితశారదారవిందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి.

ప్రతిపదార్థము :- నరకాంతక ! = నరకాసురునిఅంత మొందించిన శ్రీకృష్ణా! మమ = నాకు, దివి, వా = స్వర్గమునందుగాని, భువి, వా = భూలోకమందుఁ గాని, నరకే, వా = నరకలోకమందుఁ గాని, ప్రకామమ్ = మిక్కిలి, వాసః = నివాసము, అస్తు = అగుఁ గాక, అవధీరితశారదారవిందౌ – అవధీరిత = తిరస్కరింపఁ బడిన, శారద = శరత్కాలమందలి, అరవిందౌ = పద్మములుగల, తే = నీయొక్క, చరణౌ = పాదములను, మరణే, అపి = మరణకాలమునందు సైతము, చింతయామి = ధ్యానము సేయుచున్నాను. 'అంతేనారాయణస్మృతిః' అంతకాలమున నారాయణస్మరణము మోక్షసాధక మనిభావము.

గీ॥ నాకమే నటు గాక భూలోకమేని
నరకమే నున్కి యగుఁ గాక నరకదమన!
శారదాంభోజములసౌరు జౌరునీదు
చరణముల మరణమున నేన్ స్మరణసేతు.

శ్లో॥ కృష్ణ! త్వదీయపదపంకజపంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

ప్రతిపదార్థము :- కృష్ణ! = ఓ శ్రీకృష్ణా! మే = నాయొక్క, మానసరాజహంసః = మనస్సు అనెడు, మానససరస్సులోని రాయంచ, త్వదీయ, పద, పంకజ, పంజర, అంతమ్ = నీసంబంధ మగు పాదపద్మ మనెడు, పంజరముయొక్క, లోపలిభాగమును, అద్య, ఏవ = ఇప్పుడే, విశతు = ప్రవేశించుఁ గాక, ప్రాణప్రయాణసమయే = ప్రాణము లేచిపోవు నపుడు, కఫ, వాత, పిత్తైః = కళ్ళె, వాతము, పైత్యము, అనువీనిచే, కంఠ,

అవరోధన, విధా=కంఠము అడ్డగింపఁ బడు కార్యమునందు, తే=నీయొక్క, స్మరణమ్ = స్మరణము, కుతః = ఎక్కడిది ?

గీ॥ కృష్ణ ! భవదీయపాదపంకేజపంజ
రాంత మిప్పుడె మన్మనోహంస మేగుఁ
గాతఁ గఫవాతపిత్తముల్ కంఠ మేచు
తఱిని మరణించువేళ నీస్మరణ మెట్లు ?

(భంగ్యంతరము)

గీ॥ కృష్ణ ! యిపుడె త్వదంఘ్రిపంకేజపంజ
రాంత మస్మన్మనోరాజహంస మేగుఁ
గాతఁ గఫవాతపిత్తముల్ గంఠ మేచు
తఱిని చరమదశఁ నిన్నుఁ దలఁచు టెట్లు.

శ్లో॥ చింతయామి హరి మేవ సంతతం
మందమందహసితాననాంబుజమ్ ।
నందగోపతనయం పరాత్పరమ్
నారదాదిమునిబృందవందితమ్.

ప్రతిపదార్థము:- (అహమ్=నేను) నందగోపతనయమ్=నందగోపుని కుమారుఁడును, పరాత్ పరమ్=గొప్పవారికంటెను గొప్పవాఁడును, నారద, ఆది, ముని, బృంద, వందితమ్=నారదుఁడు మొదలుగాఁ గలమునిసమూహముచే నమస్కరింపఁ బడినవాఁడును, మంద...అంబుజమ్ – మందమంద=చిన్నిచిన్ని, హసిత=నవ్వులతోఁ గూడిన, ఆనన, అంబుజమ్=పద్మమువంటి మొగము గల, హరింఏవ=శ్రీకృష్ణునే, సంతతమ్=ఎల్లప్పుడు, చింతయామి=ధ్యానము చేయుచున్నాను.

గీ॥ నారదాదితపస్విబృందారబృంద
వందితాంఘ్రిద్వయున్ బరానందు మంద
మందహాసాంచితాస్యారవిందు నంద
నందను హరిఁ సదా స్మరణం బొనర్తు.

శ్లో॥ కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే
శ్రమముషి భుజవీచివ్యాకులే ఽ గాధమార్గే
హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం
భవమరుపరిఖిన్నః ఖేద మద్య త్యజామి. (10)

ప్రతిపదార్థము :- భవ, మరు, పరిఖిన్నః = సంసార మనెడునిర్జల ప్రదేశమునందు డస్సిన, (అహమ్=నేను) కరచరణసరోజే=చేతులు కాళ్ళు అనెడు పద్మములుగలదియు, కాంతిమత్, నేత్ర, మీనే = కాంతిగలకన్నులనెడుచేపలు గలదియు, శ్రమముషి = బడలికను బోఁగొట్టునదియు, భుజ, వీచి, వ్యాకులే = బాహువు లనెడుఅలలచే నిండినదియు, అగాధమార్గే = లోఁతైనదారి గలదియు, అగు, హరిసరసి = శ్రీకృష్ణుఁ డనుకొలనులో, విగాహ్య = చొచ్చి, తేజః, జల, ఓఘమ్ = తేజ స్సనెడు నీటిమొత్తమును, ఆపీయ=తనివారఁ ద్రావి, ఖేదమ్=బడలికను, అద్య=ఇప్పుడే, త్యజామి = విడుచుచున్నాను.

చ॥ కరచరణంబు తామరలు
గా, జిగికన్నులు మీలుగా, భుజాల్
తరగలుగా నగాధము త
తశ్రీ వారక మైనవిష్ణు వన్
సరసున మున్గితేజ మను
సజ్జలమున్ మనసారఁ గ్రోలి, సం
సరణమరుప్రసారితవి
పాదుఁడఁ బాయుదు ఖేద మిప్పుడే.

శ్లో॥ సరసిజనయనే సశంఖచక్రే
మురభిది మావిరమ స్వచిత్త! రంతుమ్।
సుఖతర మపరం న జాతు జానే
హరిచరణస్మరణామృతేన తుల్యమ్.

ప్రతిపదార్థము :- హే స్వచిత్త! ఓ నామనస్సా! సరసిజ, నయనే = తామరలవంటి కనులుగలవాఁడును, సశంఖచక్రే = శంఖచక్రములతోఁ గూడినవాఁడును అగు, మురభిది = మురాసురుని సంహారించిన శ్రీకృష్ణునియందు, రంతుమ్ = క్రీడించుటకు, మా, విరమ = మానవలదు, జాతు = ఎన్నఁటికిని, హరి, చరణ, స్మరణ, అమృతేన = భగవంతుని పాద స్మరణమనెడు అమృతముతో, తుల్యమ్ = సమానముగు, సుఖతరమ్ = మిక్కిలి సుఖమును గలిగించునట్టి, అపరమ్ = మఱియొకదానిని, న, జానే = ఎఱుఁగను.

గీ॥ జలజనయనుండును సశంఖచక్రుఁడైన
పుండరీకాక్షుఁ గీర్తింపకుండఁబోకు
హరిపద స్మరణామృత ఝురమువోలె
సుఖదము మనంబ! వేఱొండు చూడఁబోను.

శ్లో॥ మా భీర్మందమనో విచింత్య బహుధా
యామీశ్చిరం యాతనా
నామీ నః ప్రభవంతి పాపరిపవః
స్వామీ నను శ్రీధరః ।
ఆలస్యం వ్యపనీయ భక్తి సులభం
ధ్యాయ స్వనారాయణం
లోకస్య వ్యసనాప నోదనకరో
దాసస్యకిం నక్షమః.

ప్రతిపదార్థము :- మంద ! = తెలివిలేని, (హే) మనః = ఓమనస్సా!, యామీః = యమునిసంబంధములగు, యాతనాః = ( నరక ) బాధలను, బహుధా = పెక్కువిధములుగా, చిరమ్ = చాలకాలము, విచింత్య = విచారించి, భీః = భయము, మా = వలదు. అమీ = ఈ, పాపరిపవః = పాపము

లనెడు శత్రువులు, నః=మనకొఱకు, న, పరిభవంతి = (ఏమిచేయుటకును) సమర్థములుగావు, శ్రీధరః = సిరినిదాల్చిన శ్రీహరి, స్వామీ, నను = ప్రభువుగదా, (శ్రీహరి రక్షకుఁడై యుండఁబాపములేమియుఁ జేయఁజాలవని భావము.) ఆలస్యమ్ = జాగును, వ్యపనీయ=పోఁగొట్టుకొని, భక్తిసులభమ్=భక్తిచే సులువుగాఁ బొందఁదగిన, స్వ, నారాయణమ్ = మన నారాయణమూర్తిని, ధ్యాయ = ధ్యానముసేయుము, లోకస్య = లోకముయొక్క, వ్యసన, అపనోదన, కరః = దుఃఖమును బోఁగొట్టునట్టి ఆనారాయణుఁడు, దాసస్య=దాసునియొక్క, (దుఃఖమునుబోఁగొట్టుటకు) క్షమః=సమరుఁడు, న, కిమ్=కాఁడా? యేమి, అగునని భావము.

ఉ॥ ఆ యమయాతనల్ దలఁచి
యంజెద వేటికి వెఱ్ఱిడెందమా!
యీయవిమోఁచఁ జాల వొక
యింతయు శ్రీహరి సామిగాఁగ నా
రాయణు భక్తి సాధ్య నచి
రంబుగఁ గొల్వుమ యేరి కష్టమేఁ
బాయఁగఁజేయు నాథుఁడు
పాయఁగఁజేయఁడె దాసకష్టముల్.

శ్లో॥ భవజలధిగతానాం ద్వంద్వవాతాహతానాం
సుతదుహితృకళత్ర త్రాణభారార్దితానామ్
విషమ విషయతోయే మజ్జతా మప్లవానాం
భవతి శరణ మేకో విష్ణుపోతో నరాణామ్.

ప్రతిపదార్థము :- భవ, జలధి, గతానామ్ = సంసారసాగరమును బ్రవేశించినట్టియు, ద్వంద్వ, వాత, ఆహతానామ్ = ద్వంద్వములనెడు గాడ్పులచేఁ గొట్టఁబడినట్టియు, సుత...అర్దితానామ్-సుత = కొడుకులు, దుహితృ=కూఁతులు, కళత్ర=భార్యలు, (వీరియొక్క) త్రాణ=రక్షించుట అను, భార = బరువుచే, అర్దితానామ్ = బాధింపఁబడినట్టియు, విషమ,

విషయ, తోయే=హెచ్చుతగ్గులగు విషయసుఖములనెడు నీటియందు, మజ్జతామ్ = మునుఁగుచున్నట్టియు, అప్లవానామ్ = తెప్పలేనట్టియు, నరాణామ్ = మానవులకు, విష్ణుపోతః=విష్ణువనెడు తెప్ప. ఏకః = ఒకటియే, శరణమ్ = రక్షకము, భవతి = అగుచున్నది.

గీ॥ భవజలధిసంగతుల ద్వంద్వవాతహతుల
తనయదుహితృకళత్రసంతానభరుల
విషమవిషయాంబుమగ్నుల విప్లవులను
ఉద్ధరింపంగ శ్రీహరి యొకఁడె తెప్ప.

శ్లో॥ భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితిచేతో మాస్మగాః కాతరత్వమ్
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్.

ప్రతిపదార్థము :- (హే) చేతః=ఓమనస్సా! అగాధమ్=అంతులేని, భవజలధిమ్ = సంసారసాగరమును, అహమ్ = నేను, కథమ్ = ఎట్లు, నిస్తరేయమ్=దాఁటుదును, ఇతి=అని, కాతరత్వమ్ = పిఱికితనమును, మా, స్మ, గాః=పొందవలదు ? దేవే = క్రీడాదిగుణ విశిష్టుఁడును, సరసిజ, దృశి = తామరలవంటి కన్నులుగల, నరకభిది=నరకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని యందు, నిషణ్ణా=లగ్నమైన, తావకీ=నీదగు, భక్తిః=భక్తి, ఏకా=ఒకటియే, అవశ్యమ్=తప్పక, తారయిష్యతి = ఒడ్డుచేర్పఁగలదు.

గీ॥ దుస్తర మగాధమగు భవతోయరాశి
నెట్లుదాఁటుదు నను భీతియేల మనస !
పద్మలోచనుఁడౌ హరిపైనిభక్తి
యొక్కటియె నావయై నిన్ను నొడ్డుచేర్చు.

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనో
ద్ధూతమోహోర్మిమాలే

దారావర్తే తనయసహజ
  గ్రాహసంఘాకులే చ
సంసారాఖ్యే మహతి జలధౌ
  మజ్జతాంనస్త్రిధామన్ !
పాదాంభోజే వరద ! భవతో
  భక్తి నావం ప్రయచ్ఛ.

ప్రతిపదార్థము :- తృష్ణాతోయే = పేరాసలే నీరుగాఁగలదియు, మదన...మాలే_మదన=మన్మథుఁడనెడు, పవన = గాలిచేత, ఉద్ధూత=పైకి లేపఁబడిన, మోహ=అజ్ఞానమనెడు, ఊర్మి = తరంగములయొక్క, మాలే = పంక్తిగలదియు, దార+ఆవర్తే = భార్యఅను సుడులుగలదియు, తనయ... ఆకులే_తనయ=కొడుకులు, సహజ = సోదరులు అను, గ్రాహ = మొసళ్ళ యొక్క, సంఘ=సమూహముచే, ఆకులే = నిండినదియు, సంసారాఖ్యే = సంసారమనుపేరుగల, మహతి = పెద్ద, జలధౌ = సముద్రమునందు, మజ్జతామ్=మునుఁగుచున్న, నః=మాకు, (హే) త్రిధామన్ =(1 శ్వేతద్వీపము 2 అనంతాసనము 3 వైకుంఠము అను) మూఁడుస్థానములు గలవాఁడా! వరద ! = వరముల నొసంగువాఁడా ! భవతః=తమయొక్క, పాదాంభోజే= అడుగుఁదామరయందు, భక్తినావమ్=భక్తియను ఓడను, ప్రయచ్ఛ=ఇమ్ము.

శా॥ పేరాసల్ జలమై, యనంగపవనో
  ద్వేలోరు మోహోర్మికా
పారంబై సుతసోదరాదిమకర
  వ్యాకీర్ణమై భీమమై
దారావర్తమునౌ భవాబ్ధిఁబడిచిం
  తంజెందుమాకున్ శుభా
కారా ! త్వత్పదపద్మభక్తిమయనౌ
  కన్ వే ప్రసాదింపవే.

శ్లో॥ మాద్రాక్షం క్షీణపుణ్యాన్
క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే
మా శ్రౌషం శ్రావ్యబంధం
తవ చరిత మపాస్యాన్య దాఖ్యానజాతమ్ ।
మాస్మార్షం మాధవ! త్వా
మపి భువనపతే! చేతసాఽపహ్నువానాన్
మాభూవం త్వత్సపర్యా
వ్యతికరరహితో జన్మజన్మాంతరేఽపి. (16)

ప్రతిపదార్థము:- (హే)మాధవ! ఓ శ్రీకృష్ణా! క్షీణపుణ్యాన్=క్షీణించిన పుణ్యములుగలవారు గనుకనే, క్షణమపి=క్షణకాలమేనియు, భవతః=నీయొక్క, పదాబ్జే = పాదపద్మమునందు, భక్తిహీనాన్ = భక్తిలేనివారిని, మాద్రాక్షమ్=చూడఁజాలను, శ్రావ్యబంధమ్=వినఁదగినకూర్పుగల, తవ=నీయొక్క, చరితమ్=కథను, అపాస్య=విడిచి, అన్యత్=ఇతరమగు, ఆఖ్యాన, జాతమ్= చరిత్రలసమూహమును, మాశ్రౌషమ్ = వినఁజాలను, (హే) భువనపతే != ఓ జగన్నాథా! త్వామ్=నిన్ను, చేతసా అపి=మనస్సుతోనైన, అపహ్నువానాన్=మఱుఁగుపుచ్చువారిని, మాస్మార్షమ్=స్మరింపఁజాలను, జన్మజన్మాంతరే అపి=జన్మజన్మాంతరమునందును, త్వత్, సపర్యా, వ్యతికర, రహితః = నీ పూజాసంబంధము లేనివాఁడను, మాభూవమ్ = కాఁజాలను.

మ॥ కనఁగాఁతన్ భవదంఘ్రిభక్త్యలసులై
కన్పట్టుపాపాత్ములన్
వినఁగాఁతన్ విడి నీచరిత్రముల నె
వ్వే శ్రావ్యకావ్యంబులన్

మనసా నిన్నె యుపహ్నవించుజడులన్
త్రైలోక్యనాథా! తలం
పనుగాతన్ భవదర్చనంబు విడి ని
ల్వంగాత మెప్పట్టునన్.

శ్లో॥ జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం
చేతో! భజ, శ్రీధరం
పాణిద్వంద్వ! సమర్చ, యాచ్యుతకథాః
శ్రోత్రద్వయ! త్వం శృణు,
కృష్ణం లోకయ లోచనద్వయ!, హరే
ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం,
జిఘ్ర ఘ్రాణ! ముకుందపాదతులసీం,
మూర్ధన్! నమాధోక్షజమ్. (17)

ప్రతిపదార్థము :- జిహ్వే! = ఓనాలుకా! కేశవమ్ = శ్రీకృష్ణుని, (క,=బ్రహ్మను, ఈశ=ఈశ్వరుని, వమ్=ప్రవర్తింపఁజేయువానిని) కీర్తయ= కీర్తింపుము, చేతః! = ఓమనస్సా! మురరిపుమ్=మురవైరి యగు శ్రీకృష్ణుని, భజ=సేవింపుము, పాణిద్వంద్వ! = ఓకేలుదోయీ! శ్రీధరమ్=సిరిని (ఉరమున) దాల్చినశ్రీహరిని, సమర్చయ=భక్తిశ్రద్ధలతోఁ బూజింపుము, శ్రోత్రద్వయ,=కర్ణయుగ్మమా! అచ్యుతకథాః = శ్రీహరికథలను, త్వమ్ = నీవు, శృణు=విను, లోచనద్వయ! = ఓకన్నులజంటా! కృష్ణమ్ = శ్రీకృష్ణుని, లోకయ=చూడుము, అంఘ్రియుగ్మ! ఓపాదద్వంద్వమా! హరేః=విష్ణువుయొక్క, ఆలయమ్=గుడినిగూర్చి, గచ్ఛ=వెళ్ళుము, ఘ్రాణ!= ఓముక్కా! ముకుందపాదతులసీమ్ = మోక్షము నొసఁగు శ్రీకృష్ణునిపాదములందలి

తులసిని, జిఘ్ర=మూర్కొనుము, మూర్ధన్! = ఓశిరస్సా! అధోక్షజమ్ = శ్రీహరిని, నమ=నమస్కరింపుము.

మ॥ పరికీర్తింపుము జిహ్వా! కేశవుని, భా
వంబా! హరిం గొల్వు, శ్రీ
ధరు నర్చింపుము పాణియుగ్మ!, విను శ్రో
త్రద్వంద్వమా! తత్కథల్,
మురవైరిం గను మక్షి!, చేరు హరిగే
హం బాదమా!, విష్ణు నో
శిరమా! మ్రొక్కు, ముకుందపాదతులసిం
జేకొమ్ము యోఘ్రాణమా!

శ్లో॥ హేలోకాః! శృణుత ప్రసూతిమరణ
వ్యాధే శ్చికిత్సా మిమాం
యోగజ్ఞా స్సముదాహరంతి మునయో
యాం యాజ్ఞవల్క్యాదయః
అంతర్జ్యోతి రమేయ మేక మమృతం
కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే
నిర్వాణ మాత్యంతికమ్. (18)

ప్రతిపదార్థము :- హేలోకాః! = ఓజనులారా! యామ్ = దేనిని, యోగజ్ఞాః = యోగశాస్త్రము నెఱింగిన, యాజ్ఞవల్క్యాదయః = యాజ్ఞవల్క్యుఁడు మున్నగాఁగల, మునయః=మునులు, సముదాహరంతి=చక్కగాఁ జెప్పుచున్నారో, (తామ్=అట్టి) ఇమామ్ = ఈచెప్పఁబోవు, ప్రసూతిమరణవ్యాధేః = జననము మరణము అనువ్యాధికి, చికిత్సామ్ = ఔషధసేవను,

శ్రుణుత = వినుఁడు, అంతర్జ్యోతిః = లోపలవెలుతురు గలదియు, అమేయమ్ = లెక్కింప శక్యము గానిదియు, కృష్ణాఖ్యమ్ = కృష్ణుఁ డను పేరుగల, అమృతమ్ = అమృతము, ఏకమ్ = ఒకటియే, అపీయతామ్ = తనివిదీరఁ ద్రాగఁబడుఁగాక; పీతమ్ = త్రాగఁబడినదై, తత్ = ఆ, పరమౌషధమ్= ఉత్తమ మగుమందు, ఆత్యంతికమ్=అత్యంతమగు, నిర్వాణమ్=మోక్షమును, వితనుతే = విస్తరింపఁజేయుచున్నది.

మ॥ జను లాలింపుఁడు యాజ్ఞవల్క్యమునిరా
జన్యాదు లామోఁగు లీ
జననాంతామయకోటి కెత్తినచికి
త్సన్ దేని బోధించిరో
యనిమేయం బది త్రావుఁ డెంతయును గృ
ష్ణాఖ్యామృతజ్యోతి, త్రా
గినచో నాపరమౌషధం బొసఁగు ము
క్తిన్ మీకు ముమ్మాటికిన్.

శ్లో॥ హే మర్త్యాః! పరమం హితం శ్రుణుత వో
వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం
సమ్యక్ ప్రవిశ్య స్థితాః
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో
నారాయణాయే త్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం
ప్రావర్తయధ్వం ముహుః.

ప్రతిపదార్థము :- ఆపత్, ఊర్మి, బహుళీమ్=ఆపద లనెడుఅలలచే అధికమగు, సంసారార్ణవమ్ = సంసార మనుసముద్రమును, సమ్యక్ = బాగుగా, ప్రవిశ్య=చొచ్చి, స్థితాః = ఉన్న, హే మర్త్యాః = మరణశీలు రగు ఓమనుజులారా!, వః=మీరు, పరమమ్=మిక్కిలి, హితమ్=మేలుగూర్చు విషయమును, సంక్షేపతః = సంగ్రహముగా, వక్ష్యామి = చెప్పఁబోవు చున్నాను, శృణుత=వినుఁడు. నానా అజ్ఞానమ్ = వివిధమగు అవివేకమును, అపాస్య = త్రోసివైచి, సప్రణవమ్ = ఓంకారముతోఁ గూడినదియు, ప్రణామసహితమ్=నమస్కారముతోఁగూడినదియు అగు, 'నమో నారాయణాయ' ఇతి = 'నమో నారాయణాయ' అను, అముమ్ = ఈ, మంత్రమ్ = మంత్రమును, చేతసి = మనస్సునందు, ముహుః = మాటిమాటికి, ప్రావర్తయధ్వమ్ = జపింపుఁడు.

మ॥ అమితాపత్ప్రదమౌ భవాబ్ధిఁ బడి య
ట్లల్లాడునో మర్త్యులా
ర! మదీయోక్తి వినుండు సంగ్రహము మీ
అం బల్కుదున్ — వీడుఁ డ
న్యము లేలా యవివేకముల్ ? మది 'నమో
నారాయణా' యేతి మం
త్రము భక్తిఁ బ్రణవప్రణామములతో
ధ్యానింపుఁడీ సారెకున్.

శ్లో॥ పృథ్వీ రేణు రణుః, పయాంసి కణికాః,
ఫల్గుః స్ఫులింగో మహాత్
తేజో, నిశ్వసనం మరు త్తనుతరం,
రంధ్రం సుసూక్ష్మం నభః,

క్షుద్రా రుద్రపితామహప్రభృతయః,
కీటా స్సమస్తా స్సురాః—
దృష్టే యత్ర స తావకో విజయతే
భూమాఽవధూతావధిః. (20)

ప్రతిపదార్థము :- యత్ర = ఏ నీమహిమ, దృష్టే=చూడఁబడఁగా, పృథ్వీ=భూమి, అణుః = సూక్ష్మమగు, రేణుః = పరాగమో, పయాంసి = సముద్రజలములు, కణికాః=నీటిచుక్కలో, మహత్=గొప్పదియగు, తేజః= అగ్ని, ఫల్గుః = మినుకు మినుకుమను, స్ఫులింగః = నిప్పురవయో, మరుత్= వాయువు, తనుతరం=సన్నగిలిన, నిశ్వసనం=నిశ్వాసమో, నభః=ఆకాశము, సుసూక్ష్మమ్ = మిక్కిలి సన్నని, రంధ్రమ్ = బెజ్జమో, రుద్ర, పితామహ, ప్రభృతయః = శివుఁడు బ్రహ్మమున్నగాఁగల, సమస్తాః = అందఱు, సురాః = దేవతలు, క్షుద్రాః = చిన్న, కీటాః = పురుగులో, సః = అట్టి, తావకః = నీసంబంధియగు, అవధూత-అవధిః=త్రోసివేయఁబడిన అంతము గల (అనంతమగు) భూమా = మహిమ, విజయతే = సర్వోత్కృష్టమై వెలయుచున్నది.

మ॥ ధర సర్వం బొకయింత రేణువు, సము
ద్రంబుల్ తుషారంబు, ల
గ్గురు తేజం బొకనిప్పురవ్వ, శ్వసనాం
కూరంబు పెన్వాయు, వం
బరముల్ సూక్ష్మతరంబు రంధ్రము, క్రిముల్
బ్రహ్మాదు, లెద్దానిముం
దరఁ, దాదృక్షభవన్మహామహిమకున్
దాసోహముల్ శ్రీహరీ !

శ్లో॥ బద్ధే నాంజలినా, నతేన శిరసా,
గాత్రైస్సరోమోద్గమైః,
కంఠేన స్వరగద్గదేన, నయనే
నోద్గీర్ణ బాష్పాంబునా,
నిత్యం త్వచ్చరణారవిందయుగళ
ధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష! సతతం
సంపద్యతాం జీవితమ్. (21)

ప్రతిపదార్థము:- (హే) సరసీరుహాక్ష! = పద్మములఁబోలు కన్నులు కల ఓ శ్రీకృష్ణా! బద్ధేన = కట్టఁబడిన, అంజలినా = దోసిలిచేతను, నతేన = వంచఁబడిన, శిరసా = తలచేతను, సరోమోద్గమైః = పులకలతోఁగూడిన, గాత్రైః = అవయవములచేతను, స్వరగద్గదేన=స్వరమునందు డగ్గుత్తికపడిన, కంఠేన=కంఠముచేతను, ఉద్గీర్ణ, బాష్ప, అంబునా=వెడలుచున్న కన్నీరుగల, నయనేన = కనులచేతను, నిత్యమ్=ఎల్లప్పుడు, త్వత్...ఆస్వాదినామ్—త్వత్=నీ, చరణ, అరవింద = పద్మములవంటి పాదములయొక్క, యుగళ = జంటను, ధ్యాన = ధ్యానముసేయుటయను, అమృత=అమృతమును, ఆస్వాదినామ్=చవిచూచుచున్న, అస్మాకమ్=మాకు, సతతమ్=ఎల్లప్పుడు, జీవితమ్=జీవితకాలము, సంపద్యతామ్=కడచిపోవుఁగాక.

మ॥ కేలుందోయిట మోడ్పు, నమ్రత తలన్,
గెందమ్మిఁబూఁదేనెమేల్
జాలుంబోలు కనుంగవన్ గుతుకబా
ష్పశ్రేణి, మైఁ బుల్కలున్,

వాలాయంబుగఁ గుత్తుకన్ స్ఖలితసూ
వా కొప్పు, మా కేఁగుతఱ
గాలం బెప్డు త్వదంఘ్రిచింతనకథా
ఖండామృతాస్వాదనన్.

శ్లో॥ హేగోపాలక! హేకృపాజలనిధే!
హేసింధుకన్యాపతే!
హేకంసాంతక! హేగజేంద్రకరుణా
పారీణ! హేమాధవ!
హేరామానుజ! హేజగత్త్రయగురో!
హేపుండరీకాక్ష! మాం
హేగోపీజననాథ! పాలయ పరం
జానామి న త్వాం వినా. (22)

ప్రతిపదార్థము:- సులభము...త్వాంవినా పరం న జానామి=నిన్నుఁ దప్ప నితరుని ఎఱుఁగను.

శా॥ ఓ గోపాలక! యోకృపాజలనిధీ!
ఓసింధుకన్యాపతీ!
ఓగోవింద! గజేంద్రపాలనకళా
భ్యాల్లాసి! యోమాధవా!
ఓగీతామృతవర్షి దేశికమణీ!
యోపుండరీకాక్ష! న
న్నోగోపీజననాథ! ప్రోవు మెద నే
నొల్లన్ ద్వదన్యంబులన్.

హే గోపాలక! = ఓ ఆలకాపరీ! లేదా - వేదవాక్కులఁ బాలించు వాఁడా! లేదా - భూమి నేలువాఁడా! హే కృపా జలనిధే! = ఓ దయా సముద్రుఁడా! హే సింధుకన్యా పతే! = ఓ లక్ష్మీపతీ! హే కంసాంతక! = ఓ కంసుని జంపినవాఁడా! హే గజేంద్ర కరుణాపారీణ! = గజేంద్రుని విషయమున దయాపారమును బొందినవాఁడా! హే మాధవ! = ఓ లక్ష్మీపతీ! లేదా-ఓ మధువంశమునఁ బుట్టినవాఁడా! హే రామానుజ! = ఓ బలరామునితమ్ముఁడా! హే జగత్, త్రయ, గురో! = ఓ ముల్లోకములకు నొజ్జయగువాఁడా! హే పుండరీకాక్ష! = ఓ తెల్లఁదామరలవంటి కన్నులు గల వాఁడా! హే గోపీజననాథ! = ఓ గోపికలకు దిక్కైనవాఁడా! మాం = నన్ను, పాలయ = రక్షింపుము, త్వాం = నిన్ను, వినా = తక్క, పరమ్ = అన్యుని, న, జానామి = ఎఱుఁగను.

శ్లో॥ భక్తాపాయభుజంగగారుడమణి
స్త్రైలోక్యరక్షామణి
ర్గోపీలోచనచాతకాంబుదమణి
స్సౌందర్యముద్రామణిః ।
యః కాంతామణిరుక్మిణీఘనకుచ
ద్వంద్వైకభూషామణిః
శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో
గోపాలచూడామణిః. (23)

ప్రతిపదార్థము:- భక్త, అపాయ, భుజంగ, గారుడమణిః = భక్తుల కష్టము లనెడు పాములకు గరుడమణివంటివాఁడును, త్రైలోక్య, రక్షామణిః = ముల్లోకములకు మేలైనరక్ష యగువాఁడును; గోపీ, లోచన, చాతక, అంబుదమణిః = గోపికలకన్ను లనెడు వానకోయిలలకు మంచి మబ్బు వంటివాఁడును, సౌందర్యముద్రామణిః = అందమునకు మేటిముద్రవంటి వాఁడును, కాంతా...మణిః - కాంతామణి = స్త్రీరత్నమగు, రుక్మిణీ = రుక్మిణీ దేవియొక్క, ఘన = గొప్ప, కుచ = స్తనములయొక్క, ద్వంద్వ = జంటకు,

ఏకః = ప్రధానమగు, భూషామణిః = మణిభూషణమువంటివాఁడును, దేవశిఖామణిః = వేల్పులకుఁ దలమానికమువంటివాఁడును, అగు-గోపాలచూడామణిః = గొల్లలకు శిరోమణివంటివాఁడును, యః = ఎవఁడో, (సః = ఆకృష్ణుఁడు) నః=మాకొఱకు, శ్రేయః=శ్రేయస్సును, దిశతు=ఇచ్చుఁగాక.

సీ. భక్తజనంబులపాలియాపద లను
కాలసర్పములకు గారుడంబు
వ్రజయోషిదక్షు లన్ వానకోయిలలకుఁ
గౌతుకం బొనఁగూర్చు కాఱుమబ్బు
సచరాచరము లైనసకలలోకములకు
నభయదాన మొనర్చునంగరక్ష
రుక్మిణీమణిఘనోరోజయుగ్మమునకు
మంచియందం బిచ్చుమానికంబు
గీ॥ అందమునకెల్లఁ దా నెల్లయైనవాఁడు
వేలుపుంగమిలోఁ బేరువెలయువాఁడు
శ్రేయముల నెప్డు కూరిమి చిలుక మాకుఁ
గూర్చుఁగావుత నల్లనిగొల్లవాఁడు.

శ్లో॥ శత్రుచ్ఛేదైకమంత్రం సకల ముపనిష
ద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముపచితతమ
స్సంఘనిర్యాణమంత్రమ్
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసం
దష్టసంత్రాణమంత్రం

జిహ్వే! శ్రీకృష్ణమంత్రం జప జప సతతం
జన్మసాఫల్యమంత్రమ్. (24)

ప్రతిపదార్థము :- జిహ్వే! = ఓ నాలుకా! శత్రు, ఛ్ఛేద, ఏక, మంత్రమ్ = శత్రునాశనమునకు ముఖ్యమంత్రమును, సకలమ్ = కళలతోఁ గూడినదియు, ఉపనిషత్, వాక్య, సంపూజ్య, మంత్రమ్ = ఉపనిషద్వాక్యములలోఁ బూజింపఁదగిన మంత్రమును, సంసార, ఉత్తార, మంత్రమ్ = సంసారమునుండి ఉద్ధరించుమంత్రమును, సముపచిత, తమః, సంఘ, నిర్యాణ, మంత్రమ్ = మిక్కిలి ప్రోవుచేయఁబడిన అజ్ఞానతమస్సుయొక్క సమూహమును బోఁగొట్టుమంత్రమును, సర్వ, ఐశ్వర్య, ఏక, మంత్రమ్ = అఖిలైశ్వర్యములకు ముఖ్యమంత్రమును, వ్యసన, భుజగ, సందష్ట, సంత్రాణ, మంత్రమ్ = దుఃఖములనెడుపాములచేఁ గఱవఁబడినవారిని రక్షించుమంత్రమును, జన్మసాఫల్యమంత్రమ్ = జన్మమును సఫలమొనర్చు మంత్రముగు, శ్రీకృష్ణమంత్రమ్ = శ్రీకృష్ణమంత్రమును, సతతమ్ = ఎల్లప్పుడు, జప, జప = జపముచేయుము, జపముచేయుము.

చ॥ అరుల నడంచుమంత్రము, మ
హావిభవం బిడుమంత్ర, మెంతో ము
మ్మరపు దమంబుఁ బోనడఁచు
మంత్రము, దుర్వ్యసనాహిదష్టులన్
దర ముడిపించునోపనిష
దం బగుమంత్రము, జన్మ ధన్య మౌఁ
ద్వరగ జపింపు నాల్కా! భవ
తారకమంత్రముఁ గృష్ణమంత్రమున్.

శ్లో॥ వ్యామోహప్రశమౌషధం,
మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం,

దైత్యేంద్రార్తికరౌషధం,
త్రిభువనీసంజీవనైకౌషధమ్,
భక్తాత్యంతహితౌషధం,
భవభయప్రధ్వంసనైకౌషధం,
శ్రేయఃప్రాప్తికరౌషధం,
పిబ మనః శ్రీకృష్ణదివ్యౌషధమ్. (25)

ప్రతిపదార్థము:- (హే) మనః! = ఓమనస్సా! వ్యామోహ, ప్రశమ, ఔషధమ్ = మూర్ఛలను బోఁగొట్టుమందును, ముని, మనో, వృత్తి, ప్రవృత్తి, ఔషధమ్ = యోగుల మనోవృత్తులను ప్రవర్తింపఁజేయు మందును, దైత్యేంద్ర, ఆర్తి, కర, ఔషధమ్ = రాక్షసరాజులకు బాధ గలిగించుమందును, త్రిభువనీ, సంజీవన, ఏక, ఔషధమ్ = ముల్లోకములను బ్రతికించుటకు ముఖ్యమగుమందును, భక్త, అత్యంత, హిత, ఔషధమ్ = భక్తులకు మిక్కిలిహితమును గలిగించుమందును, భవ, భయ, ప్రధ్వంసన, ఏక, ఔషధమ్ = సంసారభయమును నిర్మూలింపఁజేయు ముఖ్యమగుమందును, శ్రేయఃప్రాప్తికర, ఔషధమ్=మేలును బొందించుమందును, అగు, శ్రీకృష్ణదివ్యౌషధమ్=శ్రీకృష్ణుఁడను దివ్యమగుమందును, పిబ=త్రావుము.

మ॥ మునిహృద్వృత్తి ఘటించునౌషధము, వ్యా
మోహప్రణాశౌషధం
బును, దైత్యార్తికరౌషధంబుఁ ద్రిజగం
బుం బ్రోచునయ్యౌషధం
బును, భక్తౌఘహితౌషధంబు, భవసం
భూతార్తినాశౌషధం
బును, కృష్ణౌషధ మాను మానసమ! య
బ్బున్ సౌఖ్య మెంతేనియున్.

శ్లో॥ ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం,
వేదవ్రతా న్యన్వహం
మేదశ్ఛేదఫలాని, పూర్తవిధయః
సర్వే హుతం భస్మని,
తీర్థానా మవగాహనాని చ గజ
స్నానం, వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతీ ర్విజయతే
దేవ స్స నారాయణః. (26)

ప్రతిపదార్థము:- యత్పద...సంస్మృతీః_ యత్ =ఏ నారాయణుని, పదద్వంద్వ, అంభోరుహ = తామరలఁబోలు అడుగులజంటయొక్క, సంస్మృతీః వినా=స్మరణములు లేకుండ, ఆమ్నాయ, అభ్యసనాని = వేదముల నలవాటుచేయుటలు, అరణ్యరుదితమ్ = అరణ్యరోదనమువంటివో (నిష్ఫలము) అన్వహమ్=ప్రతిదినము, వేదవ్రతాని = వేదోక్తములగువ్రతములు, మేదః, ఛేద, ఫలాని=క్రొవ్వు నశించుటయే ఫలముగాఁగలవియో, సర్వే= సమస్తములగు, పూర్తవిధయః = కోనేఱులు త్రవ్వించుట మున్నగు ధర్మ కార్యములు, భస్మని = బూదెలోని, హుతమ్ = హోమమువంటివో, తీర్థానామ్ = గంగాదిపుణ్యతీర్థములయొక్క, అవగాహనాని = స్నానములు, గజస్నానమ్=ఏనుఁగుస్నానమువంటివో, సః = ఆ, దేవః = క్రీడాదిగుణ విశిష్టుఁడగు, నారాయణః=నారాయణమూర్తి, విజయతే=సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు.

శా. వేదాభ్యాస మరణ్యరోదనము, త
ద్వేదవ్రతాదుల్ వృథా
మేదశ్ఛేదఫలాలు, పూర్తవిధు లే
మీ బూదెలో నేయి, త

ద్వేదండాంబునిమజ్జనోపమితముల్
దీర్థాటనల్, ధాత్రి య
త్త్వాదాబ్జస్మృతి లేనిచో నతని నే
ధ్యానింతు నారాయణున్.

శ్లో॥ శ్రీమ న్నామ ప్రోచ్య నారాయణాఖ్యం
కే న ప్రాపు ర్వాంఛితం పాపినోఽపి ?
హా ! నః పూర్వం వాక్ ప్రవృత్తా న తస్మిన్
తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్. (27)

ప్రతిపదార్థము :- పాపినః అపి = పాపాత్ములైనను, కే = ఎవరు, నారాయణ, ఆఖ్యమ్=నారాయణుఁడను పేరుగల, శ్రీమత్=సంపదగల, నామ=పేరును, ప్రోచ్య=కీర్తించి, వాంఛితమ్ = కోర్కెని, న, ప్రాపుః = పొందరైరి ? (అందఱును బొందిరి అనిభావము) హా=అయ్యో ! పూర్వమ్= పూర్వజన్మమున, నః=మాయొక్క, వాక్=వాక్కు, తస్మిన్=ఆనారాయణు నందు, న, ప్రవృత్తా=ప్రవేశింపలేదు, తేన=అందుచే, గర్భవాస, ఆది, దుఃఖమ్=గర్భనరకము మొదలగు వ్యసనము, ప్రాప్తమ్ = పొందఁబడినది.

గీ. ఏరు నారాయణాభిధోచ్చారణమునఁ
బాపు లయ్యు నభీష్టముల్ వడయ లేరు ?
మును పహా ! యెన్నఁ డతనిఁ బేర్కొనమిఁ జేసి
గర్భవాసాదిదుఃఖముల్ గలిగె మాకు.

శ్లో॥ మజ్జన్మనః ఫల మిదం మధుకైటభారే !
మత్ప్రార్థనీయమదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ ! (28)

ప్రతిపదార్థము :- (హే) మధుకైటభారే ! = మధువు, కైటభుఁడు, అనురక్కసులకు శత్రువగు ఓశ్రీకృష్ణా! మత్, జన్మనః=నాపుట్టువునకు, ఇదమ్=ఇది, ఫలమ్=ఫలము, మత్, ప్రార్థనీయ, మత్, అనుగ్రహః= నాచేఁగోరఁదగిన నామీఁదియనుగ్రహము, ఏష ఏవ = ఇదియే, హే, లోకనాథ! = ఓజగదీశుఁడా ! మాం=నన్ను, త్వత్ ...భృత్యః_త్వత్ =నీయొక్క, భృత్య=భృత్యునకు, భృత్యే=భృత్యునియొక్క, పరిచారక భృత్య=సేవకుని భృత్యునియొక్క, భృత్య=సేవకునియొక్క, భృత్యస్య = సేవకునియొక్క, భృత్యః ఇతి=భృత్యుఁడనని, స్మర=తలంచుము.

గీ. ఇదియె మజ్జన్మఫలిత మిదే మదర్థ
నీయమదనుగ్రహము భవదీయభృత్య
భృత్యతద్భృత్యతద్భృత్యభృత్యభృత్య
భృత్యుఁడ నటంచు నన్ను భావింపు మీశ !

శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతా
మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే
నారాయణే తిష్ఠతి
యం కంచిత్ పురుషాధమం కతిపయ
గ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నర మహో !
మూకా వరాకా వయమ్. (29)

ప్రతిపదార్థము :- నః = మనకు, నాథే=ప్రభువును, త్రిజగతామ్= ముల్లోకములకు, ఏకాధిపే=సార్వభౌముఁడును, చేతసా=మనస్సుచే, సేవ్యే= సేవింపఁదగినవాఁడును, స్వస్య=తన, పదస్య=స్థానమును, దాతరి = ఇచ్చువాఁడును, పురుషోత్తమే = పురుషశ్రేష్ఠుఁడును, సురే = దేవతయు నగు,

నారాయణే = నారాయణమూర్తి, తిష్ఠతి = ఉండఁగా, కతిపయ, గ్రామ, ఈశమ్=కొన్ని గ్రామములకే ప్రభువైనట్టియు, అల్ప, అర్థ, దమ్=కొలఁది ధనమునే యిచ్చునట్టియు, పురుషాధమమ్=పురుషులలో నీచుఁడైనట్టియు, యం కంచిత్=ఎవనినో ఒక, నరమ్=మనుష్యుని, సేవాయై=కొల్వుకొఱకు, మృగయామహే = వెదకుచున్నాము; అహో! = ఔరా! వయమ్=మనము, మూఢాః = మూఁగలము, వరాకాః = గవ్వలవంటివారము (పనికిమాలినవారమని తా.)

శా. దేవుండుం బురుషోత్తముండు హృదయ
ధ్యేయుండు లోకేశుఁడున్
గైవల్యప్రదుఁ డస్మదీశుఁ డగు శ్రీ
నారాయణుం డుండఁగా
సేవాఁడో యఁగువాని, నల్పుని, నె
వ్వేఁ గొన్నియానూళ్ళ వే
ల్పౌవానిన్ నరుఁ గొల్వ వ్యర్థులముఁ మే
మర్థించుచున్నా మహో!

శ్లో॥ మదన! పరిహార స్థితిం మదీయే
మనసి ముకుంద పదారవిందధామ్ని
హరనయనకృశానునా కృశోఽపి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః. (30)

ప్రతిపదార్థము :- మదన! = ఓమన్మథుఁడా! ముకుంద, పద, అరవింద, ధామ్ని = శ్రీకృష్ణుని పాదపద్మములకు నిలయమగు, మదీయే= నా, మనసి = మనస్సునందు, స్థితిం = ఉనికిని, పరిహార = వదలిపెట్టుము, హర, నయన, కృశానునా=ఈశ్వరుని కంటిమంటచే, కృశః అపి = చిక్కినవాఁడవయ్యును, మురారేః = మురవైరియగు శ్రీకృష్ణునియొక్క, చక్రపరాక్రమమ్=చక్రముయొక్క, బలమును, న, స్మరసి=తలఁపకున్నావు.

గీ. మార! చనుమా ముకుందపాదారవింద
నిలయమగా నాదుమనసులో నిలువఁబోకు
హరునికనుమంటను గృశుండ వయ్యు మరలఁ
దలఁప వదియేమి హరిచక్రధాటి యెదను.

శ్లో॥ తత్త్వం బ్రువాణాని పరం పరస్మాత్
మధు క్షరంతీవ సతాం ఫలాని
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే!
నామాని నారాయణగోచరాణి. (31)

ప్రతిపదార్థము :- హే జిహ్వే! = ఓనాలుకా! పరస్మాత్, పరమ్ = ఉత్తమోత్తమమగు, తత్త్వమ్ = పరతత్త్వమును, బ్రువాణాని = చెప్పునవియు, సతామ్ = సజ్జనులకు, మధు = తేనెను, క్షరంతి = స్రవించునట్టి, ఫలాని ఇవ = పండ్లవలెనున్న, నారాయణగోచరాణి = విష్ణుమూర్తిని గోచరింపఁజేయు (విష్ణుసంబంధములగు) నామాని = పేరులను, ప్రావర్తయ = వల్లింపుము, ప్రాంజలిః = దోసిలి యొగ్గినవాఁడను, అస్మి = అగుచున్నాను.

గీ. తెల్లముగఁ బరతత్త్వంబుఁ దెలుపునవియు
ఫలములటు సాధులకుఁ దేనెఁ జిలుకునవియుఁ
గోరి నారాయణుం డెప్డు గోచరించు
నామములఁ బల్కు మ్రొక్కెదు నాల్క! నీకు.

శ్లో॥ ఇదం శరీరం పరిణామపేశలం
పత త్యవశ్యం శ్లథసంధిజర్జరమ్
కి మౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ. (32)

ప్రతిపదార్థము :- ఇదమ్ = ఈ, శరీరమ్ = దేహము (శౄ = హింసాయామ్ – శీర్యత ఇతి = 'శరీరమ్' అను వ్యుత్పత్తిచే నశించుస్వభావము గలది

యని భావము.) పరిణామ, పేశలమ్=ముదిమిచే సుకుమారమైనది, కనుక నే, శ్లథ, సంధి=సడలినకీళ్లు గలది, జర్జరమ్ = వదులైనది. (కనుక) అవశ్యమ్ = తప్పక, పతతి = పడిపోవును. మూఢ ! = తెలివిలేనివాఁడా ! దుర్మతే! = దుష్టబుద్ధిగలవాఁడా ! ఔషధైః = మందులచే, క్లిశ్యసి, కిమ్ = కష్టపడెద వేల ? నిరామయమ్=రోగమును రానీయుని, కృష్ణరసాయనమ్ = కృష్ణుఁడను రసాయనమును (పుష్టి నిచ్చునందును.) పిబ = త్రాగుము.

గీ. ఈశరీరంబు పరిణామపేశలంబు,
జడుఁడ ! పడు నెప్డొ శ్లథసంధిజర్జరంబు
వెడఁగుమందుల నాయాసపడకు, త్రావు
మామయహరంబు, గృష్ణరసాయనంబు.

శ్లో॥ దారా వారాకరవరసుతా,
తే తనూజో విరించిః,
స్తోతా వేద స్తవ, సురగణో
భృత్యవర్గః, ప్రసాదః
ముక్తి, ర్మాయా జగ దవికలం,
తావకీ, దేవకీ తే
మాతా, మిత్రం బలరిపుసుత,
స్త్వ య్యతోఽన్య న్నజానే. (౩౩)

ప్రతిపదార్థము:- వారాకర, వర, సుతా=పాలకడలియొక్క శ్రేష్ఠురాలగు కొమార్తె, తే = నీయొక్క, దారాః = ఇల్లాలు, విరించిః = నలువ, తే = నీయొక్క, తనూజః = కుమారుఁడు, తవ = నీకు, వేదః = వేదము, స్తోతా = వంది, సురగణః = దేవతాసమూహము, భృత్యవర్గః = సేవకగణము, ప్రసాదః = (నీ) అనుగ్రహము, ముక్తిః = మోక్షము, జగత్ = లోకము, అవికలమ్ = సర్వము, తావకీ = నీదగు, మాయా = ప్రకృతి,

దేవకీ = దేవకీదేవి, తే = నీయొక్క, మాతా = తల్లి, బలరిపు, సుతః=దేవేంద్రుని కుమారుఁడు (అర్జునుఁడు) మిత్రమ్=చెలికాఁడు, త్వయి = నీవిషయమున, అతః = ఇంతకంటె, అన్యత్ = ఇతరము, న, జానే = ఎఱుఁగను.

ఉ. నీదుకళత్రి మబ్ధిసుత,
నీ కొమరుండు విరించి, వేదమే
నీదగువంది, వేలుపులె
నీదగుసేవకు, లోక్కముక్తియే
నీదుప్రసాద, మిజ్జగమె
నీదగుమాయ, బలారిసూనుఁడే
నీదుహితుండు, దేవకియె
నీతలి, యింతయె యే నెఱుంగుదున్.

శ్లో॥ కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః,
కృష్ణం నమస్యా మ్యహం,
కృష్ణే నామరశత్రవో వినిహతాః,
కృష్ణాయ తస్మై నమః,
కృష్ణాదేవ సముత్థితం జగ దిదం,
కృష్ణస్య దాసోఽస్మ్యహం,
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం,
హేకృష్ణ! రక్షస్వ మామ్. (34)

ప్రతిపదార్థము :- (ఈశ్లోకమునందు సర్వవిభక్తుల నుపయోగించి కృష్ణుని పఠించుచున్నాఁడు.) జగత్, త్రయ, గురుః=ముల్లోకములకు గురువగు, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, నః = మమ్ములను, రక్షతు = రక్షించుఁగాక, అహమ్=నేను, కృష్ణమ్ = శ్రీకృష్ణుని, నమస్యామి = నమస్కరింపఁగలను, కృష్ణేన = శ్రీకృష్ణునిచే, అమరశత్రవః=రాక్షసులు, వినిహతాః = చంపఁ

బడిరి, తస్మై = అట్టి, కృష్ణాయ = కృష్ణునికొఱకు, నమః=నమస్కారము, కృష్ణాత్, ఏవ = శ్రీకృష్ణునివలననే, ఇదమ్ = ఈ, జగత్=లోకము, సముత్థితమ్ = బయలువెడలినది, అహమ్=నేను, కృష్ణస్య = శ్రీకృష్ణునియొక్క, దాసః = దాసుఁడను, అస్మి = అగుచున్నాను, కృష్ణే=శ్రీకృష్ణునియందు, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తజగము, అఖిలమ్=నశింపకుండ, తిష్ఠతి=ఉన్నది, హేకృష్ణ = ఓశ్రీకృష్ణా! మామ్ = నన్ను, రక్షస్వ = రక్షింపుము.

ఉ. కృష్ణుఁడు ప్రోచుఁగాత మముఁ,
గృష్ణుఁ బ్రణామ మొనర్తు, రక్కసుల్
కృష్ణునిచేత నీల్గి, రల
కృష్ణునికై కయిమోడ్తుఁ, బుట్టె శ్రీ
కృష్ణునినుండి యిజ్జగము,
కృష్ణుని కేను భటుండ, సర్వమున్
గృష్ణునియందు నుండు, ననుఁ
గృష్ణ! జగత్పతి! కావుమా దయన్.

శ్లో॥ తత్త్వం ప్రసీద భగవన్! కురు మయ్యనాథే
విష్ణో! కృపాం పరమకారుణికః కిల త్వమ్
సంసారసాగరనిమగ్న మనంత! దీన
ముద్ధర్తు మర్హసి హరే! పురుషోత్తమోఽసి. (35)

ప్రతిపదార్థము :- హేభగవన్ = ఓషడ్గుణైశ్వర్యసంపన్నుఁడా! తత్ = కనుక, త్వమ్ = నీవు, ప్రసీద=ప్రసన్నుఁడవు గమ్ము! హేవిష్ణో= సర్వవ్యాపకుఁడవగు ఓవిష్ణుమూర్తీ! అనాథే = దిక్కులేని, మయి = నాయందు, కృపామ్ = దయను, కురు = చేయుము; త్వమ్ = నీవు, పరమ కారుణికః, కిల = మిక్కిలిదయగలవాఁడవుగదా. హేఅనంత=ఓఅంతులేని వాఁడా! సంసార, సాగర, నిమగ్నమ్ = సంసారసముద్రమున మునిఁగిన, దీనమ్=దీనుఁడనగు (మామ్=నన్ను) ఉద్ధర్తుమ్=ఉద్ధరించుటకు, అర్హసి = తగియున్నావు. పురుషోత్తమః=పురుషులలో శ్రేష్ఠుఁడవు, అసి=అగుచున్నావు.

చ. శరణము గమ్ము, చూపుము ప్ర
సాద, మనాథుఁడ నైననాపయిం
గరుణ వహింపుమా, పరమ
కారుణికుండవు గావె? ఘోరసం
సరణమహాంబుధిం గడవఁ
జాలక మున్గెడుదీను నన్ను ను
ద్ధరణ మొనర్ప నీకుఁ దగ
దా? పురుషోత్తముఁ డీవు గావొకో?

శ్లో. నమామి నారాయణపాదపంకజం
కరోమి నారాయణపూజనం సదా
వదామి నారాయణనామ నిర్మలం
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్. (36)

ప్రతిపదార్థము:- అహమ్=నేను, నారాయణపాదపంకజమ్=నారాయణమూర్తియొక్క అడుగుఁదమ్ములను, నమామి=నమస్కరించుచున్నాను; సదా = ఎల్లప్పుడు, నారాయణపూజనమ్ = శ్రీనారాయణమూర్తిపూజను, కరోమి = చేయుచున్నాను; నిర్మలమ్ = దోషరహితమగు, నారాయణనామ = నారాయణమూర్తినామమును, వదామి = నుడువుచున్నాను; అవ్యయమ్ = నాశరహితమగు, నారాయణతత్త్వమ్ = శ్రీనారాయణ పరతత్త్వమును, స్మరామి = తలఁచుచున్నాను.

గీ. ప్రణతి నారాయణునిపాదపద్మములకు
ఆచరించెద నారాయణాంఘ్రిపూజ
విమలనారాయణాభిధానము వచింతుఁ
దలఁతు నారాయణునిపరతత్త్వ మాత్మ.

శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
(8) శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే!

శ్రీపద్మనాభాచ్యుత! కైటభారే!
శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! (37)

శ్లో. అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ!
గోవింద! దామోదర! మాధవేతి।
వక్తుం సమర్థోపి న వక్తి కశ్చి
దహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్. (38)

ప్రతిపదార్థము :- (పైరెండుశ్లోకములకు ఏకాన్వయము) అర్థము సులభము - 'శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! శ్రీపద్మనాభ! అచ్యుత! కైటభారే! శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ! గోవింద! దామోదర! మాధవ!' ఇతి=అని (పైవిధముగా భగవంతుని సంబోధించి) వక్తుమ్=పల్కుటకు, సమర్థః అపి = శక్తిగలవాఁడయ్యు, కశ్చిత్ = ఒకఁడును, న, వక్తి=పలుకఁడు; అహో! = ఔరా! జనానామ్ = జనులయొక్క, వ్యసన + అభిముఖ్యమ్=తుచ్ఛభోగములమీఁది యుబలాటము.

క. శ్రీనాథా! నారాయణ!
శ్రీనందకుమార! చక్రి! సీతాజానీ!
ఓనళినోదర! మధువై
రీ! నళినాక్షా! పరా! హరీ! మురవైరీ!

గీ. కేశవ! అనంత! వైకుంఠ! కృష్ణ! దైత్య
దమన! గోవింద! వరద! మాధవ! యఁటంచు
నుడువఁగలిగియు నక్కటా! నుడువఁ డొకఁడు
జనులవ్యసనోన్ముఖత్వ మేమని వచింతు.

శ్లో॥ ధ్యాయంతి యే విష్ణు మనంత మవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్

సమాహితానాం సతతాభయప్రదం
తే యాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్. (39)

ప్రతిపదార్థము :- యే = ఎవరు, అనంతమ్ = అంతులేనివాఁడును, అక్షయమ్ = నాశము లేనివాఁడును, సతతమ్=ఎల్లప్పుడును, హృత్, పద్మ, మధ్యే=హృదయపద్మమునడుమ, వ్యవస్థితమ్=ఉన్నవాఁడును, సమాహితానామ్ = సమాధినిష్ఠు లగుయోగులకు, సతత, అభయ, ప్రదమ్ = ఎప్పుడు నభయదానము సేయువాఁడును - అగు, విష్ణుమ్ = శ్రీ మహావిష్ణువును, ధ్యాయంతి = ధ్యాన మొనర్చుచున్నారో, తే=వారు, పరమామ్=శ్రేష్ఠమగు, వైష్ణవీమ్ = విష్ణుసంబంధమగు, సిద్ధిమ్ = మోక్షమును, యాంతి = పొందుచున్నారు.

గీ. అవ్యయు ననంతు విష్ణు సమాహితాభ
యప్రదుని సర్వదా హృదబ్జాంతరస్థు
నెడ తెగక ధ్యాన మొనరింతు రెవరు వారు
తరలఁగలవారు వైష్ణవధామమునకు.

శ్లో. క్షీరసాగరతరంగశీకరా
సారతారకితచారుమూర్తయే
భోగిభోగశయనీయశాయినే
మాధవాయ మధువిద్విషే నమః. (40)

ప్రతిపదార్థము :- క్షీర...మూర్తయే—క్షీరసాగర = పాలకడలియొక్క, తరంగ = అలలయొక్క, శీకర=తుంపరల, ఆసార = ఎడ తెగని వానచేత, తారకిత = ముత్యాలపేరు ధరించినట్లున్న, చారు = అందమగు, మూర్తయే=శరీరము గలట్టియు, భోగి...శాయినే—భోగి = పాముయొక్క (శేషునియొక్క) భోగ = శరీరమనెడు, శయనీయ=పాన్పునందు, శాయినే=పరుండెడు, మధువిద్విషే = మధుసూదనుఁడగు, మాధవాయ = లక్ష్మీపతియగు నారాయణునికొఱకు, నమః = నమస్కారము.

గీ. పాలసంద్రంపుటలలతుంపరలగములు
మేన ముత్యాలసరులట్లు మించువానిఁ,

బాఁపరాయని మైమెన్జెఁ బవ్వళించు
వానిఁ, గలుముల చెలి చెలికానిఁ గొలతు.

* * *

శ్లో. యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మవర పద్మశరా వభూతామ్
తేనాంబుజాక్ష చరణాంబుజషట్పదేన
రాజ్ఞా కృతా కృతి రియం కులశేఖరేణ. (41)

ప్రతిపదార్థము :- శ్రుతిధరౌ=వేదములను ధరించినవారును, కవిలోకవీరౌ=కవిలోకమున వీరులును, ద్విజన్మవర, పద్మ, శరౌ = బ్రాహ్మణోత్తము లగుపద్మ, శరులనువారు, యస్య=ఎవనికి, ప్రియౌ = ఇష్టులగు, మిత్రే=మిత్రములో, తేన = అట్టియు, అంబుజ-అక్ష = తామరలఁబోలు కన్నులుగల, శ్రీకృష్ణునియొక్క, చరణ, అంబుజ = అడుగుఁదామరలందు, షట్పదేన=తుమ్మెదవంటివాఁడునునగు, కులశేఖరేణ=కులశేఖరుఁడను, రాజ్ఞా=రాజుచే, ఇయమ్ = ఈ, కృతిః = 'ముకుందమాల' యను గ్రంథము, కృతా = చేయఁబడినది.

మ. శ్రుతిసంపన్నులు, బాడబుల్, సుకవితా
శూరుల్, సుహృద్వర్యు, ల
ప్రతిముల్, పద్మశరాఖ్యు లెవ్వనికి, న
ప్పద్మాక్ష సేవామధు
వ్రతమౌ శ్రీకులశేఖరుండు రసము
ప్పం గూర్ప గీర్వాణభా
రతికిన్ భూషగ, దాని మార్చె నిటు పూ
ర్ణ ప్రజ్ఞఁ డాంధ్రినకున్.

# ముకుందమాలానుబంధము

శ్లో॥ శ్రీముకుందపదాంభోజ
మధునః పరమాద్భుతమ్ ।
యత్పాయినో న ముహ్యంతి
ముహ్యంతి య దపాయినః.

ప్రతిపదార్థము:- యత్పాయినః=దేనిని ద్రావువారు, న, ముహ్యంతి= మత్తులుగారో, యత్, అపాయినః = దేనిని ద్రావనివారు, ముహ్యంతి = మత్తు లగుచున్నారో- (తస్య = అట్టి) శ్రీముకుంద...మధునః - శ్రీ = సంపద్యుక్తుఁడగు, ముకుంద = మోక్షప్రదుఁ డగు నారాయణుని యొక్క, పద, అంభోజ=పాదపద్మమునందలి, మధునః=తేనెయొక్క, (మహత్త్వము) పరమ, అద్భుతమ్=అత్యంతాశ్చర్యకర మైనది.

గీ॥ దేనిఁ గ్రోలినవారు మత్తిల్ల కుందురో
దేనిఁ గ్రోలనివారు మత్తిల్లుచుందురో
అట్టి శ్రీమన్ముకుందపాదారవింద
మధుమహత్త్వంబు పరమవిస్మయకరంబు.

శ్లో॥ మా మే స్త్రీత్వం, మా చ మే స్యా త్కుభావో,
మా మూర్ఖత్వం, మా కుదేశేషు జన్మ ।
మిథ్యాదృష్టి ర్మా చ మే స్యాత్ కదాచిత్,
జాతౌ జాతౌ విష్ణుభక్తో భవేయమ్. 2

ప్రతిపదార్థము:- మే=నాకు, స్త్రీత్వమ్=ఆఁడుఁదనము, మా-స్యాత్= లేకపోవుఁగాక; మే=నాకు, కుభావః, చ=కుత్సితభావమును, మా-స్యాత్= లేకపోవుఁగాక; మూర్ఖత్వమ్ = మూర్ఖపుఁదనము, మా-స్యాత్=లేకపోవుఁ గాక; కుదేశేషు = చెడుదేశములయందు, జన్మ = పుట్టువు, మా-స్యాత్=

లేకపోవుఁగాక; కదాచిత్=ఎప్పటికిని, మిథ్యాదృష్టిః=అసత్యపుఁజూపు, (జగత్తుమిథ్యయనెడి జ్ఞానము)మా-స్యాత్=లేకపోవుఁగాక; జాతౌ, జాతౌ=జన్మజన్మమున, విష్ణుభక్తః = విష్ణువునందు భక్తికలవాఁడను, భవేయమ్=అగుదునుగాక.

గీ॥ నాకు స్త్రీత్వంబు రాకుండుఁగాక! మూర్ఖ
భావము, కుభావము, కుదేశభవము లేక
పోవుఁగాక! మిథ్యాదృష్టి పొలియుఁగాక!
అవుదుఁగాక వైష్ణవుఁడఁ బుట్టువుల నెల్ల.

శ్లో॥ వాత్సల్యా, దభయఃప్రదానసమయా,
దార్తార్తినిర్వాపణా,
దౌదార్యా, దఘశోషణా, దగణిత
శ్రేయఃపదప్రాపణాత్ ।
సేవ్యః శ్రీపతిరేవ సర్వజగతా
మేతే చ షట్సాక్షిణః
ప్రహ్లాదశ్చ, విభీషణశ్చ, కరిరాట్,
పాంచా, ల్యహల్యా, ధ్రువః. 3

ప్రతిపదార్థము:- వాత్సల్యాత్ = జాలివలనను, అభయ, ప్రదాన, సమయాత్=అభయ మిచ్చువిషయమునఁ బ్రతిజ్ఞవలనను, ఆర్త,ఆర్తి, నిర్వాపణాత్ = బాధితుల బాధలను బోఁగొట్టుటవలనను, ఔదార్యాత్=ఈవివలనను, అఘశోషణాత్=పాపములకు ఇంకింపఁ జేయుటవలనను, అగణిత, శ్రేయః, పద, ప్రాపణాత్=లెక్క పెట్టఁ బడని (గొప్ప) మేలునుగూర్చు ఉన్నతస్థానమును బొందించుటవలనను, శ్రీపతిః ఏవ = లక్ష్మీపతి యగు నారాయణుఁడే, సర్వజగతామ్ = ఎల్లలోకములకు, సేవ్యః=సేవింపఁ దగినవాఁడు (ఈవిషయములందుఁ గ్రమముగా) ప్రహ్లాదః చ = ప్రహ్లాదుఁడును, విభీషణః చ=విభీషణుఁడును, కరిరాట్ = గజేంద్రుఁడును, పాంచాలీ = ద్రౌపదియు, అహల్యా = అహల్యయు, ధ్రువః=ధ్రువుఁడును, ఏతే=వీరు, షట్ చ=ఆర్గురును, సాక్షిణః = సాక్షులు.

శా॥ జాలిం బూనినగుండెవాఁ డభయ మీఁ
జాలున్, స్వభక్తార్తి ని
ర్మూలించున్ దెగుదారి, పాపముఁ బొకా
ర్చుం, జేర్చు నుచ్చైః స్థితిన్-
శ్రీలక్ష్మీశుఁడె సేవ్యుఁ, డార్గు రిట వీ
రే సాక్షు, లాదైత్యరా
డ్బాలుం, డల్ల విభీషణుండు, కరిరా,
ట్పాంచా, ల్యహల్యా, ధ్రువుల్.

శ్లో॥ యత్ కృష్ణప్రణిపాతధూళిధవళం
తద్వై శిరః స్యా చ్ఛుభం,
తే నేత్రే తమసోజ్ఝితే సురుచిరే
యాభ్యాం హరి ర్దృశ్యతే।
సా బుద్ధి ర్నియమై ర్యమైశ్చ విమలా
యా మాధవధ్యాయినీ,
సా జిహ్వాఽమృతవర్షిణీ ప్రతిపదం
యా స్తౌతి నారాయణమ్. 4

ప్రతిపదార్థము:- యత్=ఏది, కృష్ణ, ప్రణిపాత, ధూళి, ధవళమ్ = శ్రీకృష్ణునకు నమస్కరించుటచే (అంటిన) దుమ్ముచేఁ దెల్లనిదో, తత్ = ఆ, శిరః=తలయే, శుభమ్=మంగళకరము, స్యాత్=అగును; వై=ప్రసిద్ధము, యాభ్యామ్=వేనిచేత, హరిః=శ్రీహరి, దృశ్యతే=చూడఁ బడునో, తే=ఆ, నేత్రే=కన్నులే, తమసా = అంధకారముచే, ఉజ్ఝితే=విడిచిపెట్టఁ బడినవియు, సురుచిరే=అందములైనవియు, (స్తః = అగుచున్నవి) యా=ఏది, యమైః, నియమైః, చ=యమనియమములచే (సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము,

ఈపదియుం యమములు – తపము, సంతోషము ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము – ఈపదియు నియమములు) విమలా=నిర్మలమై, మాధవ, ధ్యాయినీ=శ్రీహరిని ధ్యాన మొనర్చునో, సా=అదియే, బుద్ధిః = బుద్ధి; యా=ఏది, ప్రతిపదమ్=మాట మాటయందు, అమృతవర్షిణీ = అమృతమును గురియుచు, నారాయణమ్ = శ్రీవిష్ణువును, స్తౌతి=స్తుతించునో, సా=అదియే, జిహ్వా=నాలుక.

చ॥ సరసిరుహాక్షుపాదముల

సాఁగిలి మ్రొక్క రజః పరిదిగ్ధమౌ

శిరమె శిరంబు; శ్రీశు దరి

సించినకన్నులె కన్ను; లాపదా

త్పరు నిరతంబు లోనఁ దలఁ

పంగలబుద్ధియె బుద్ధి; గోపసుం

దరు సుధలూరఁగాఁ బలుకు

నాల్కయె నాలుక పల్కు పల్కునన్.

శ్లో॥ ఆశ్చర్య మేతద్ధి మనుష్యలోకే

సుధాం పరిత్యజ్య విషం పిబంతి ।

నామాని నారాయణగోచరాణి

త్యక్త్వాఽన్యవాచః కుహకాః పఠంతి. 5

ప్రతిపదార్థము :- మనుష్యలోకే=మర్త్యలోకమునందు, (మనుజులు) సుధామ్=అమృతమును, పరిత్యజ్య=విడిచిపెట్టి, విషం=విషమును, పిబంతి= తాగుచున్నారు; నారాయణగోచరాణి = శ్రీనారాయణమూర్తిని గనఁ బఱచు, నామాని=నామములను, త్యక్త్వా = వదలిపెట్టి, కుహకాః=మోస గాండ్రు, అన్యవాచః=ఇతరవాక్కులను, పఠంతి = పేర్కొనుచున్నారు; ఏతత్=ఇది, ఆశ్చర్యం హి = ఆశ్చర్యముగదా!

గీ. ఇదియె వింతలలో వింత యిజ్జగాన
సుధను వీడి విషంబునే చూఱఁగొందు
మధుమథనగోచరముల నామముల వీడి
పెఱనుడుల్ మాయదారులు పేరుకొందు.

శ్లో. లాటీనేత్రపుటీపయోధరఘటీ
రేవాతటీనిష్కుటీ
పాటీరద్రుమవర్ణనేన కవిభి
ర్మూఢై ర్దినం నీయతే
గోవిందేతి జనార్దనేతి జగతాం
నాథేతి కృష్ణేతి చ
వ్యాహారై స్సమయ స్తదేకమనసాం
పుంసా మతిక్రామతి. 6

ప్రతిపదార్థము :- మూఢైః = తెలివిలేని, కవిభిః=కవులచే, లాటీ—వర్ణనేన - లాటీ = లాటస్త్రీలయొక్క, నేత్రపుటీ = దొప్పలవంటికన్నుల యొక్కయు, పయోధర, ఘటీ=కలశములవంటికుచములయొక్కయు, రేవా తటీ = నర్మదానదిగట్టుమీఁది, నిష్కుటీ = పొదరిండ్లయొక్కయు, పాటీర ద్రుమ = మంచిగంధపుఁజెట్లయొక్కయు, వర్ణనేన=వర్ణనచే, దినమ్=రోజు, (కాలము) నీయతే=కడపఁబడుచున్నది ; తత్, ఏక, మనసామ్=ఆభగవం తునియందే మనస్సుగల, పుంసామ్=పురుషులకు, గోవింద! ఇతి=గోవింద ! అనియు, జనార్దన! ఇతి = జనార్దనుఁడా! అనియు, జగతాం నాథ ! ఇతి=జగన్నాథా ! అనియు, కృష్ణ! ఇతి=కృష్ణా! అనియు, వ్యాహారైః= పలుకులతో, సమయః=కాలము, అతిక్రామతి=కడచుచున్నది.

శా. లాటీనేత్రపుటీపయోధరఘటీ
లాస్యేందుజానిష్కుటీ
పాటీరద్రుమవర్ణనక్ వితగ దు
ర్భావుల్ కవుల్ కాలముం
బాటింతుర్, భజమానమానసతమః
పాటచ్చరా! నాకిరా
ట్కోటీరార్చితపాద! నా దినము లేఁ
గుక్ వైష్ణవశ్రేణికిన్.

(భంగ్యంతరము)

శా. లాటీనేత్రపుటీపయోధరఘటీ
లాస్యేందుజానిష్కుటీ
పాటీరద్రుమవర్ణనల్ కవులు దు
ర్భావుల్ వృథా యేటికో ।
పాటింతుర్, నిజభక్తహృ
ద్వానతమఃపాటచ్చరా! నాకిరా
ట్కోటీరార్చితపాదపీఠ !
యని పేర్కొరాదె మోక్షార్థులై॥

శ్లో. అయాచ్య మక్రేయ మయాతయామ
మపాచ్య మక్షయ్య మదుర్భరం మే ।
అస్త్యేవ పాథేయ మితః ప్రయాణే
శ్రీకృష్ణనామామృతభాగధేయమ్. 7

ప్రతిపదార్థము :- ఇతః=ఇక్కడనుండి, ప్రయాణే=ప్రయాణము కట్టునపుడు (ఈలోకమునుండి పరలోకమున కేఁగునపుడు) అయాచ్యమ్=ఇతరుల యాచింపనవసరములేనిదియు, అక్రేయం=కొననవసరములేనిదియు, అయాతయామమ్=చలిది కానిదియు, అపాచ్యమ్=వండ నవసరములేనిదియు,

అక్షయ్యమ్=తఱుగనిదియు, అదుర్భరం చ = కష్టపడి మోయ నవసరము లేని దియు, శ్రీకృష్ణ, నామ, అమృత, భాగధేయమ్=శ్రీకృష్ణుని నామామృతములో భాగమైనదియునగు, పాథేయమ్ = దారిబత్తెము, మే = నాకు, అస్తి+ఏవ=ఉండనే యున్నది.

ఉ. కేయము గాదు, దేహి యని
కేలును జాపఁగ నీదు, చల్దియై
పాయదు, వంట వార్పు గను
పట్టదు, తగ్గదు, బర్వు గాదు, బల్
తీయనికృష్ణనామ మను
దివ్యతరామృతభాగధేయపా
థేయము మాకడం గల ది
దే యిటనుండి ప్రయాణ మౌ తఱిన్.

శ్లో. అపరాధసహస్రభాజనం
పతితం భీమభవార్ణవోదరే।
అగతిం శరణాగతం హరే!
కృపయా కేవల మాత్మసాత్కురు. 8

ప్రతిపదార్థము:- హరే! = పాపహరణసమర్థుఁడ వగు శ్రీకృష్ణా! అపరాధ, సహస్ర, భాజనమ్ = వేలకొలఁది నేరములకు నెలవైనట్టియు, భీమ...ఉదరే—భీమ = భయంకరమగు, భవ, అర్ణవ=సముద్రమువంటి సంసారముయొక్క, ఉదరే=లోపల, పతితమ్=పడినట్టియు, అగతిమ్=గతి (దిక్కు) లేనట్టియు, లేదా— అ = విష్ణువగునీవే, గతిమ్ = దిక్కుగాఁ గలిగి నట్టియు ('అకారో విష్ణువాచకః' అను ప్రమాణముచే 'అ' అనఁగా విష్ణువని భావము) శరణ+ఆగతమ్=శరణుచొచ్చినట్టియు, (మామ్=నన్ను) కృపయా కేవలమ్=దయచేతనుమాత్రమే (నాయందలిగుణములచేతఁ గాదని భావము) ఆత్మసాత్=నీయధీనుని, (నీగుణములయం దనురక్తుని గా,— నీయందు భక్తుని గా నని భావము) కురు = చేయుము.

గీ. ఆలయుఁడ నపరాధసహస్రములకు
భయదభవవారినిధిమధ్యఁ బడినవాఁడ,

అగతికుండను, నిను శరణంటి దేవ!
కనికరమున నె చేకొని కావు మితని.

శ్లో. రజసి నిపతితానాం మోహజాలావృతానాం
జననమరణడోలాదుర్గసంసర్గగానామ్ ।
శరణ మశరణానా మేక ఏ వాతురాణాం
కుశలపథనియోక్తా చక్రపాణి ర్నరాణామ్. 9

ప్రతిపదార్థము :- రజసి=రజోగుణమునందు (రజోగుణకార్యమగు అనురాగమునం దని భావము) నిపతితానామ్=పడినట్టియు, మోహ, జాల, ఆవృతానామ్=మోహసమూహముచే ఆవరింపఁబడినట్టియు (లేదా) మోహమనెడువలలోఁ దగులుకొన్నట్టియు, జనన...సంసర్గగానామ్-జనన=పుట్టువు, మరణ=చావు అను, డోలాదుర్గ=నరకమువంటియుయ్యెలయొక్క, సంసర్గ=సంబంధమును, గానామ్=పొందినట్టియు, అనఁగా నరకతుల్యము లగుజనన మరణముల ననుభవించుచున్నట్టియు నని భావము) అశరణానామ్=దిక్కులేనట్టియు, (కనుకనే) ఆతురాణాం = దీనులైనట్టియు, నరాణామ్ = నరులను (కర్మణి షష్ఠి) కుశల, పథ, నియోక్తా=క్షేమమార్గమునఁ జేర్చువాఁడు, ఏకః=ఒక, చక్రపాణిః ఏవ=చక్రాయుధము హస్తమునందుఁగల శ్రీమహావిష్ణువే.

మ. అనురాగాగఘనాటవీపటలిలో
నల్లాడుచున్ మోహజా
లనిబద్ధాంతులై జనుర్మరణడో
లాదుర్గసంసర్గవే
దనలన్ స్రుక్కుచు, దిక్కుమొక్కు గన కా
త్మం గుందునాపన్నులా
జనులన్ క్షేమపథంబుఁ జేర్ప గతి శ్రీ
చక్రాయుధుం డొక్కఁడే.

శ్రీసీతాలక్ష్మణసమేత, శ్రీకోదండరామార్పణమస్తు.

ఆఫీసు ఫోన్ నెం. 254 సెక్రెటరి ఫోన్ నెం. 254 A.

# శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘము (రిజిష్టర్డు)

## శ్రీరామనామక్షేత్రము, గుంటూరు-1

గ్రంథాలయ అధికారులు, సారస్వతాభిమానులు, ఆధ్యాత్మిక సంస్థల వారు తనకు కావలసిన గ్రంథములను తెప్పించుకొని మేము చేయు ప్రచారమునకు తోడ్పడ కోరుచున్నాము.

### ఆధ్యాత్మిక గ్రంథములు

| | |
|---|---|
| 1.*యాత్రామార్గదర్శిద.భా. | 4- 0-0 |
| 2.* ,, ఉ.భా. | 4- 0-0 |
| చైతన్యచరితావళి (బైండు) | 3 0-0 |
| భాగవతకథ (1, 2, 3, 4, 5 భాగములు) 1కి | 2- 0-0 |
| రజతోత్సవసంపుటి | 2- 0-0 |
| శ్రీరామపూజ (5వ ముద్రణ) | 1- 8-0 |
| నామసంకీర్తన (పీఠికతో) | 1- 4-0 |
| కలిసంతరణోపనిషత్తు | 1- 0-0 |
| రామనామము (గాంధీగారిచే) | 1- 0-0 |
| ఆధ్యాత్మికసాధనక్రమము | 1- 0-0 |
| రామగీత | 1- 0-0 |
| భక్తజీవనము | 0-12-0 |
| నామసంకీర్తన మహిమ | 0-12-0 |
| ప్రభాత, పవళింపుసేవలు | 0- 8-0 |
| మానసబోధ | 0- 8-0 |
| ప్రణవప్రభావము | 0- 8-0 |
| శ్రీరామనామప్రభావము | 0- 6-0 |
| బ్రహ్మచర్యము | 0- 6-0 |
| శ్రీరామపటలము | 0- 6-0 |
| గీతాప్రబోధము | 0- 4-0 |
| శ్రీరామసహస్రనామావళి రు | 0- 4-0 |
| సంఘ చరిత్ర | 0- 4-0 |
| తత్త్వత్రయము | 0- 3-0 |
| సంకీర్తనరామాయణము | 0- 2-6 |
| శ్రీరామగుణసంకీర్తన | 0- 2-0 |

### సాధనసామాగ్రి

| | |
|---|---|
| రామనామ ఉత్తరీయములు రు | 7- 0-0 |
| కార్పెట్ ఆసనము | 4-0-0, 3- 0-0 |
| ముద్రణ రేకులు | 1-12-0, 1- 8-0 |
| నామతోరణం (శంఖు, చక్ర) | 1- 4-0 |
| పండరిచిరుతలు | 6″ 1-4-0, 5″ 1-2-0 |
| ,, | 4″ 1- 0-0 |
| నామతోరణము | 0-14-0 |
| అచ్చుతులసిమాల | 0-12-0 |
| కాశీ దర్భాసనము | 1-4-0, 0-12-0 |
| శ్రీరామకోటి లేఖనగ్రంథము | |
| ,, ,, (లఘు) | 0-12-0 |
| బృందావనజపసంచి (మెడది) | 0- 6-0 |
| మూలవిరాట్ (త్రివర్ణపటం) | 0- 4-0 |
| శ్రీరామయంత్రపటము | 0- 2-0 |
| చైతన్యత్రివర్ణపటము | 0- 2-0 |
| దినచర్యాహారము | 0- 0-6 |

1. * Approved for Public and school libraries Dis. No. 4010/54 dated 22-11-54. *2. Dis. No. 11156. 5-4-56.